


సంపుటి:1 సంచిక: 2 పుటలు:68 విడి ప్రతి వెల: 25 రూ. డిసెంబరు 2014



**Editor:** Narayana Sarma

**Owned, Printed and Published by:**
Kottapalli Prachuranalu,
1-127/A, Near MRO Office,
Chennekothapalli,
Ananthapuramu District
Andhra Pradesh-515101
Website: http://kottapalli.in
Email: team@kottapalli.in
Phone: 7702677670

**Printed at:**
Mudrica Offset Printers,
Sanyasi Raju street,
Gandhi Nagar,
Vijayawada,
Andhrapradesh
Phone: 08662579129

**Title Verified By RNI**
APTEL/14249/01/1/2014-TC

**సంపాదకులు:** నారాయణ శర్మ

**గౌరవ సలహాదారు:** యు. సుబ్బరాజు

**ప్రచురణ:**

కొత్తపల్లి ప్రచురణలు, చెన్నేకొత్తపల్లి

**సహకారం:**

సత్య - ఫౌండేషన్ ఫర్ ఎ హెల్దీ సొసైటీ, చెన్నూరు.

**చిత్రాలు:**

వీరాంజనేయులు: 7799260684

అడవి రాముడు: 9491870753

ఫైనార్ట్స్ చదువుతున్న ఇతర మిత్రులు కూడా.

**వెబ్సైటు నిర్వహణ:**

ఆనంద్, లక్ష్మి

**వాణిజ్యం, మార్కెటింగు:**

కె. మల్లికార్జున: 9000453887

# విషయ సూచిక





ముఖచిత్రం: గురు నానక్

చిత్రకారుడు: వీరాంజనేయులు

# అసమానం

చలికాలం. రోజూ మంచు కురుస్తోంది. ఇప్పుడైతే సమయం ఏడు గంటలవుతున్నది. పిల్లలు రమేష్, స్వర్ణ లోపలి గదిలో ముడుచుకొని పడుకొని ఉన్నారు. వాళ్ళ నాన్న మూర్తి టీ త్రాగుతూ పేపరు చదువుతూన్నాడు. వాళ్ళమ్మ సుజాత వంటగదిలో టిఫిన్ తయారీలో ఉంది- పనమ్మాయి శాంతిని ఎప్పటిమాదిరే తిడుతోంది: "ఇదిగో, నీకు వంద సార్లు చెప్పాను- గిన్నెలు కడిగామంటే అవి తళతళలాడాలి. ఇట్లా జిడ్డోడుతూ ఉండకూడదు. మనసు ఎక్కడ పెట్టుకొని పనిచేస్తున్నావ్?" అని అరుస్తున్నది.

"అబ్బ! ప్రశాంతంగా పేపరు చదువుకోనివ్వరే! శాంతీ, ఇటొచ్చి ఈ టీ కప్పు తీసుకెళ్ళు! ప్రతిరోజూ చెప్పాలి నీకు!" రోజూ లాగే కసురుకున్నాడు మూర్తి.

"పో! పోయి సార్ దగ్గర టీ కప్పు తీసుకొచ్చి, దాన్నీ- దాంతోబాటు ఈ జిడ్డు గిన్నెల్నీ మళ్ళీ కడుగు. ఇల్లంతా ఊడ్చి తడిబట్టతో తుడువు. మనసు పెట్టు కొంచెం. అట్లా మజ్జుగా, బద్ధకంగా ఉండకు. పనులు ప్రతిరోజూ చెప్పించుకునేదెందుకు? ఇంతకీ ముఖం కడుక్కున్నావా, ఇంకా దానికి ముహూర్తం అవ్వలేదా?" హుంకరించింది సుజాత.

శాంతి తలవంచుకొనే "లేదాంటీ, ఇంకా కడుక్కోలేదు- సమయం చాల్లేదు" అంది, వెళ్ళి టీ కప్పు తెచ్చి కడిగేస్తూ.

ఇల్లంతా ఊడ్చి తడిబట్టతో తుడిచేటప్పటికి ఎనిమిది కావొస్తున్నది.

మూర్తి ఇంకా పేపరు చదువుతూనే ఉన్నాడు.

పిల్లలిద్దరూ పడుకొని ఉన్న గదిలోకి వెళ్ళి, వాళ్ళకేసి మురిపెంగా చూసుకున్నది సుజాత. అమాయకంగా నిద్రపోతున్న రమేష్, స్వర్ణల్ని చూస్తుంటే ఎంత ముద్దొస్తున్నారో! "బాబూ! నాన్నా- చిన్నా రమేష్! లే నాన్నా!- పాపా, స్వర్ణా, చిట్టి తల్లీ, లేమ్మా, లే! సమయం ఎనిమిది అవుతోంది. బడికి వెళ్ళొద్దా? బళ్లో మీ సార్లూ టీచర్లూ అందరూ ఎదురుచూస్తుంటారు

గదా?! శాంతీ! పిల్లలు లేచేసరికి వేడినీళ్ళు సిద్ధం చెయ్యాలని వందసార్లు చెప్పాను. అబ్బ, నీకు పని చెప్పటం నా బుద్ధి తక్కువ- నాయనా చిన్నా, పాపా- చిట్టి తల్లీ, లేవండిరా, లేవండి" అని ఓ పదిసార్లు ముద్దు ముద్దుగా, హడావిడిగా పిల్లల్ని లేపే సరికి మరో పదిహేను నిముషాలయింది.

లేవగానే పిల్లలిద్దరూ శాంతిమంత్రం మొదలెట్టారు-"శాంతీ! బ్రష్ ఎక్కడ? శాంతీ, పేస్టు కనబడటం లేదు! శాంతీ! నా బట్టలు ఇస్త్రీ చెయ్యలేదా? శాంతీ, అబ్బ- షూస్ పాలిష్ చేయమన్నానా- ఎంత వికారంగా చేస్తావో చూడు! నీకసలు ఏ పనీ చక్కగా రాదే? శాంతీ, జడలు వెయ్యి!"

అంతలో మూర్తి లేచి "శాంతీ! బాత్రూంలో నీళ్ళు పెట్టు! ఏ టైముకు ఏం చెయ్యాలో నీకు ఎప్పుడూ ఎవరో ఒకరు ఎందుకు చెప్పాలి? అన్నీ వరసగా చేసుకుంటూ పోవచ్చు కదా? అబ్బ, అసలు నీకు పనులు చెప్పేకంటే మా పనులు మేమే చేసుకోవటం నయమనిపిస్తున్నది" అని విసుక్కున్నాడు.

సుజాత అరిచింది వంటరూంలోంచి- "ఓ శాంతీ! మొద్దు పిల్లా! వినిపిస్తున్నదా? సారుకు నీళ్ళు పెట్టు. అంత బద్ధకంగా ఉండకు. ఇదిగో, టిఫిన్ తీసుకెళ్ళి టేబుల్ మీద పెట్టు. చేతులు బాగా కడుక్కో. ప్లేట్లూ, గ్లాసులూ, స్పూన్లూ అన్నీ తీసుకొచ్చి పెట్టు- చిన్న బాబూ! స్నానం అయ్యిందా? చిట్టి తల్లీ, ఎంతవరకూ వచ్చావు? శాంతీ! పాపకు జడలు వెయ్యి! చేతులు కడుక్కో, ముందు- ఎక్కడెక్కడ పెడతావో ఏమో, పది నిముషాలకోసారి చేతులు కడుక్కొమ్మంటే కడుక్కోవే?! సారు బట్టలు ఇస్త్రీ చేశావా, లేదా? వెంటనే చెయ్యి! లేకపోతే నా ప్రాణం తింటారు" వరసగా చదివింది.

శాంతి రమేష్‌కి షూస్ పాలిష్ చేసిచ్చింది; స్వర్ణకు జడలు వేసింది; సారుకు ఇస్త్రీ బట్టలు అందించింది; అన్నీ అయ్యాక సుజాతకు టిఫిన్ పెట్టింది; వాషింగ్ మెషీన్లో బట్టలు వేసింది; అప్పుడు వెళ్ళి మొహం కడుక్కున్నది- సుజాత అరుస్తోంది- "శాంతీ! ఎక్కడికెళ్ళావ్? ఎంత

సేపు?! అబ్బ- నీకు చెప్పేకంటే నేను చేసుకున్నది మేలు..." అని.



శాంతికి తొమ్మిదేళ్ళు. మూడో తరగతి వరకు బడికి వెళ్ళింది. ఆ తర్వాత ఇట్లా సుజాత వాళ్ళింట్లో పనికి కుదురుకున్నది. ఎవరేమన్నా, నవ్వుతూ- నిబ్బరంగా- అమాయకంగా- పనులు చేస్తూ పోతుంది.

ఇట్లా లెక్కలేనంతమంది శాంతులు- పసితనంలోనే అంతలేసి బరువుల్ని మోసే పెద్దవాళ్ళు. ఎంత సాయం చేసినా కూసింత మెప్పు పొందని చిన్నారులు- వీళ్లకి వేరే మంచి అవకాశం ఏదైనా ఉంటే బాగుండు గదా, మంచి ప్రత్యామ్నాయం దొరికితే బాగుంటుంది.

మూర్తిగారిలాంటి పెద్దలు ప్రొద్దునే పేపరు చదవటం తగ్గించుకొని ఇంటిపనులు చేసే రోజులొస్తే బలే ఉంటుంది.

సుజాతలాంటి తల్లులు తమ పిల్లలమీద చూపించే ప్రేమలో ఓ చిన్న భాగాన్ని శాంతి లాంటి అసమానులకూ కేటాయించగల్గితే బాగుండు.

రమేషులూ, స్వర్ణలూ తమ తోటి పిల్లల ప్రతిరూపాల్ని శాంతుల్లోనూ చూడగల్గితే బాగుండు.

-కదూ?

చక్కని హృదయాలున్న మీకందరికీ ఈ చలికాలంలో వెచ్చటి అభినందనలు! క్రిస్మస్ పండుగ శుభాకాంక్షలు!

కొత్తపల్లి బృందం.



మంచి పుస్తకం - మంచి తోడు




# నీతి చంద్రిక

**సంధి: 8**

*జరిగిన కథ : క్రకచం అనే మొసలి మేడి పళ్ల మీద ఆశ కొద్దీ 'బలవర్ధనం'తో స్నేహం చేసింది. ఇటు ఆ మొసలి భార్యేమో లేని రోగాన్ని నటిస్తూ పడుకున్నది. దాని జబ్బు నయమవ్వాలంటే కోతి గుండె కావాలి- తప్పనిసరి పరిస్థితుల్లో మొసలి కోతిని తమ ఇంటికి ఆహ్వానించింది. దాన్ని వీపు మీద ఎక్కించుకొని నదిలో యీదసాగింది- ఇక చదవండి, నీతి చంద్రిక 55 వ భాగం...*

కోతి మాటలు విని మొసలి తత్తరపాటుతో 'నీ చెల్లెలికి ఆరోగ్యం కొంచెం సరిగా లేదు' అన్నది.

"అయ్యో! అంత చిన్న సమస్యకేనా, నీ ముఖం ఇంత చిన్నబోయింది?! చిన్న చిన్న సమస్యలకే చిన్నబోవటం, అదే మంత శౌర్యం?!" అన్నది కోతి తేలికగా.

"వ్యాధి కొంచెం పెద్దదే" అన్నది క్రకచం, ఒకింత సందేహిస్తూ.

కోతి విచారంగా "వైద్యుల్ని పిలిపించలేదా? మొదట్లోనే మంచి ఔషధాలు వాడలేదా?!" అన్నది. తన స్నేహితుడి భార్యకు ఆరోగ్యం బాగా లేదనే సరికి దాని కళ్లలో నీళ్లు తిరిగాయి.

"ఏమి మాయరోగమో తెలియలేదు. ఎంతమంది వైద్యులు, ఎన్ని రకాలుగా ప్రయత్నించినా మేలుకాలేదు. నేను నిన్న ఇక్కడి నుండి వెళ్లేసరికి నీ చెల్లెలు యమయాతన పడుతున్నది. 'దీని నుండి బ్రతికి బట్టకట్టటమే కష్టం' అనిపిస్తున్నది" అని బదులు చెప్పింది క్రకచం, మొసలి కన్నీళ్లు కారుస్తూ.



అది విని కోతి-"అయ్యో! స్నేహితుడా! నీది ఎంత వెర్రి? ఇంట్లో భార్య చావు బ్రతుకుల్లో ఉంటే, ఆమెకు ఏ మందో-మాకో ఇప్పించటానికి బదులు, తనను ఒంటరిగా విడిచిపెట్టి స్నేహితుడి దగ్గరికి ఎట్లా రాబుద్ధయింది నీకు? ఇంట్లో అంత గంభీర స్థితిని ఉంచుకొనికూడా నన్ను విందుకు పిలిచేందుకు నీకు నోరెట్లావచ్చింది?" అని మందలించింది.

"గొప్ప వైద్యుల్ని సంప్రతించాం. వాళ్ళు 'ఈ సమస్య పెద్దదే. దీనికి కోతి గుండెతో చేసిన మందు ఇవ్వాలి" అని చెప్పారు. ఇప్పటికిప్పుడు కోతిగుండె తెమ్మంటే నేనెట్లా తెచ్చేది? నువ్వు గుర్తుకొచ్చావు. అందుకనే నేను ఇంత హడావిడిగా ఇటు రావలసి వచ్చింది"-అని తన గుట్టును బయటపెట్టేసింది- కంగారులోనూ, దు:ఖంలోనూ మతి తప్పిన క్రకచం!

ఆ మాటలువినగానే కోతి ప్రాణాలు డిబడిబలాడాయి. ఒళ్ళంతా చెమటలు పట్టాయి. ఏమనాలో, ఏం చెయ్యాలో తెలీనట్లు అది ఒక్క క్షణం నిశ్చేష్టం అయిపోయింది.

అంతలోనే తేరుకొని, మనసులోని కలవరాన్ని ఆణచుకొని, గుండెను గట్టి చేసుకొని, ఒక క్షణం పాటు మనసులో అనుకున్నది- "అయ్యో! బట్ట తల వాడెవడో ఎండ వేడికి ఓపలేక తాటిచెట్టు నీడన కూర్చుంటే తాటి

పండొచ్చి పడి తల పగిలిందట! అట్లాగ, దైవం అనుకూలించని వాడు ఎక్కడికి పోయినా ఆపదలు వెంటవస్తాయి గదా!



అడవిని విడిచిపెట్టి మృగసంచారం ఏ మాత్రం లేని సముద్రతీరాన్ని చేరుకున్నానే, అయినా రాక రాక మృత్యువు నోట్లోకే చేరుకున్నట్లయింది!" అని బాధపడుతూనే, మరొక ప్రక్కన లేని నిబ్బరాన్ని ప్రదర్శిస్తూ తటాలున-" అయ్యో! క్రకచా! ఎంత పిచ్చి పనిచేశావు?! కోతి గుండె కోసం వచ్చిన వాడివి, ఆ మాటని కొంచెం నీ స్నేహితుడి చెవిలో వేయాలని కూడా తోచలేదా, నీకు?! ఎప్పుడూ నేనుండే ఆ మేడి చెట్టుకు తగిలించి ఉంచుతాను కదా నా గుండెను?! నీ మనసులో ఉన్నదాన్ని స్నేహితుడికి చెప్పకుండా దాచి ఉంచటం వల్ల, ఇప్పుడు చూడు- పని పూర్తిగా చెడింది! ఇంత చేసిన నువ్వు నీ భార్యకు మేలు కోరేదటుంచు, గొప్ప కీడు చేసిన శత్రువువే అవుతున్నావు! మన మధ్య ఇంతవరకు నడిచినదంతా వృధా త్రిప్పటే అయ్యింది చూడు! అయితే మాత్రం మించిపోయింది ఏమున్నదిలే, వెంటనే వెనక్కి తిరిగి మేడి చెట్టు దగ్గరికి పద- గుండెకాయను తీసుకొద్దాం!" అనేసింది.

అంత ధైర్యంగా అనేసరికి మొసలికి ఇక ఆలోచించాల్సిన అవసరం పడలేదు! ఆ మాయమాటల్ని నమ్మేసి, అది తటాలున వెనక్కితిరిగింది- కోతిని మేడిచెట్టు దగ్గరికి తీసుకొచ్చి విడిచింది.

చెట్టు దగ్గరకు రాగానే అబ్బ! ప్రాణాలు దక్కాయి!" అని ఆకోతి చటుక్కున మేడిని ఎక్కేసింది! చెట్టెక్కి ఊపిరి పీల్చుకొని, దేవుడికి ధన్యవాదాలు చెప్పుకొని, ఆ తర్వాత తనకోసం ఎదురు చూస్తూ ఇంకా నీళ్లలోనే నిలబడిన మొసలిని వెక్కిరిస్తూ - "గుండె లేదు, గిండె లేదు పో, పోరా!" అని

గద్దించింది.

అది చూసి నివ్వెర పోయిన మొసలి జరిగిన మోసాన్ని తెలుసుకొని- "అయ్యో! ఏ పాపమూ ఎరుగని నన్ను యీ ముసలికోతి ఎట్లా మోసం చేసిందో చూడు!" అని ఇంకొన్ని కన్నీళ్లు కార్చింది.

అప్పుడు కోతి అది మరింత సిగ్గుపడేటట్లు "నువ్వు అతి మర్యాదగా మాట్లాడి, నొసటన దోసిలి పెట్టుకొని,'మా ఇంటికి రావల్సిందే' అని దేవురించటం వల్ల, యీ దరిద్రపు మొహమాటం ఒకటి ఏడ్చింది కాబట్టి, నా నోటితో నేను 'కాదు' అనలేక, ఒకసారి మోసపోయానే అనుకో- అయినా నన్ను ఇంకోసారి వంచించటం నీ తరమౌతుందా, ఓరి పిచ్చివాడా? చెప్పిన మాట విను! 'వచ్చి నా వలలో అలవోకగా చిక్కుకున్న వాడే మళ్లీ తప్పించుకుపోయాడే!' అని ఊరికే ఏడుస్తూ కూర్చోకు. నీదారిన నువ్వు పో. నక్క అంతటిది ఆనాడు ఒక చిన్న తాబేలు చేత మోసపోయింది కద! ఇంక నువ్వెంత?- నీకాకథ తెలుసోలేదో-విను!" అని తాబేలు-నక్క కథ వివరించసాగింది.

**తాబేలు-నక్క:**

కర్ణాటక దేశంలో 'కావేరి' అనే నది ఒకటి ప్రవహిస్తుంటుంది. అది సముద్రంలో కలిసే చోటుకు దగ్గరగా, ఆ నదీ తీరంలోనే- పెద్ద మర్రి చెట్టొకటి ఉన్నది. ఒకనాడు మధ్యాహ్నం సమయంలో తాబేలు ఒకటి నదిలోంచి బయటికి వచ్చి, ఆ చెట్టు నీడలో పడుకొన్నది.



వెచ్చగా, సుఖంగా ఉందేమో, త్వరలోనే అది గాఢ నిద్రలోకి జారుకున్నది. సరిగ్గా ఆ సమయానికి, అక్కడికి దగ్గర్లోని అడవిలో నివసించే నక్క ఒకటి, అక్కడికి వచ్చింది. బాగా దప్పికగొని ఉన్న ఆ నక్క ముందుగా

నదిలోకి పోయి, తియ్యటి నదీ జలాన్ని ఇష్టంగా త్రాగింది.

ఆ పైన గానీ అది అటూ ఇటూ చూడలేదు-చూస్తే దానికి కొంచెం దూరంలోనే చెట్టు కింద పడుకొని ఉన్న తాబేలు కనిపించింది. తాబేలును చూసేసరికి నక్కకు చాలా సంతోషం వేసింది. మెల్లమెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ పోయి, ఏమరుపాటుగా ఉన్న తాబేలు వీపు మీద చటుక్కున కాలు మోపి, అదిమి నిలబడ్డది.



అంత బరువు తన మీదకి అకస్మాత్తుగా వచ్చి పడేసరికి, తాబేలు తటాలున తలను, కాళ్ళు చేతుల్నీ కడుపులోకి లాక్కొని, ముడుచుకొని- కదలకుండా కూర్చున్నది.

ఆకలిగొని ఉన్న నక్క తాబేలును కాళ్ళతో అదిమి, అటూ ఇటూ పొర్లించి, గోర్లతో గీరి, కొరికి-ఏంచేసినా ఆ తాబేలు చిప్పను మాత్రం ఛేదించలేకపోయింది. అట్లా అని దాన్ని విడిచిపెట్టి పోయేందుకూ మనసు రాక, అది క్రింద మీద పడుతూ ఉన్నది.

అది అట్లా తంటాలు పడుతూంటే ముడుచుకొని కూర్చున్న తాబేలు తన మనసులో "లాభం లేదు- ఏదో ఒక విధంగా ఈ తిక్క నక్కను మోసగించి తప్పించుకోవాల్సిందే" అనుకొని, కొంచెం ఆలోచించి, బయటికి నక్కతో ఇట్లా అన్నది- "ఓ నక్కగారూ! అసలు తత్త్వం ఏంటో తెలుసుకోకుండా ఇట్లా ఎందుకు, వృధాగా అవస్థపడతారు? మీరు ఈ విధంగా వెయ్యేళ్ళ పాటు కొరికినా, నా ఒళ్ళు మీకు కొరుకుడు పడదు గదా! అయినా 'మీరు పంతం పట్టి ఉన్నారు; ఎట్లా అయినా తంటాలు పడతారు- గానీ నన్ను మాత్రం వదలరు" అని నాకు అర్థం అయ్యింది. బ్రతకాలన్న ఆశ

నశించింది. 'అనాయాసంగా మరణించటం మేలు' అన్న నిశ్చయానికి వచ్చేశాను. నీళ్లలోని బ్రతుకు మాది. 'చావు' అన్నది ఎప్పుడూ మా ముందే కోరలు చాపి నాట్యమాడుతూంటుంది. నువ్వు చూడగా ఆకలిగొన్న మహానుభావుడివి- అందుకని నీకు ఒక చక్కని ఉపాయం చెబుతాను, విను. నన్ను నేరుగా తీసుకొని పోయి, కొద్ది సేపు నీటిలో ఉంచి, నానబెట్టు. ఒక నిముషంలో నా శరీరం అంతా నీకు నచ్చినట్లు వెన్నలాగా మెత్తగా అయిపోతుంది. అప్పుడు కడుపారా నా మాంసంతో భోజనం చేసుకొని తిని, నీకెటు పోవాలనిపిస్తే అటు పోవచ్చు- అట్లా చెయ్యి!" అన్నది.

ఆ వెర్రినక్క దాని మాటలు నిజమనుకున్నది. 'అట్లాగే చేద్దాం' అనుకొని తాబేలును తీసుకెళ్ళి నీళ్ళలో పడేసి కూడా, కొంత మెలకువ కలిగి పట్టుమాత్రం విడవకుండా తన ముందుకాళ్ళు దాని వీపుమీద మోపి కూర్చున్నది. అటుపైన మాటిమాటికి గుటకలు మ్రింగుతూ, తన కాళ్ళ క్రింద ఉన్న తాబేలు మీదే చూపులు నిలుపుకొని, మళ్ళీ మళ్ళీ దాన్ని కొరికి చూస్తూ వచ్చింది.

ఎంత సేపటికీ తాబేలు చిప్ప మెత్తబడకపోయే సరికి చికాకు పడుతూ తాబేలుతో "ఎంత సేపైంది! నిన్ను నీళ్ళలో వేసి, నీ ఒళ్ళు మెత్తబడ్డాక తొందర తొందరగా తిని పోదామని ఎంత సేపటినుండి కాచుకొని ఉన్నానో చూస్తున్నావు కదా?! ఎంతసేపటికీ నీ ఒళ్ళు నానే అవకాశం కనిపించటం లేదు. ఎందుకంటావు?" అని అడిగింది.

అప్పుడు తాబేలు దానితో "నేనేం చెప్పేది మిత్రమా?! నా మాట మీద నీకు నమ్మకం లేదు. 'ఎక్కడ పారిపోతానో' అన్నట్లు నా వెన్ను మీద రెండు కాళ్ళూ దిట్టంగా పెట్టి కూర్చున్నావు. నా శరీరానికి నీళ్ళు ఏమాత్రం కూడా అంటే వీలు లేకుండా నా వీపునంతా ఆక్రమించుకొని నువ్వు నీ పెద్ద పెద్ద కాళ్ళు మోపాక, ఇక నా ఒళ్ళు నానమంటే ఏం నానుతుంది, నీ కోరిక తీరమంటే ఏం తీరుతుంది?

ఇదిగో చెబుతున్నాను- ఇందులో నా తప్పు వీసమంత కూడా లేదు. నీ శని కొద్దీ నువ్వే, నీ అపనమ్మకంతో ఇంత సేపు చెడ్డావు. అయినా ఇప్పుడు ఏమైందని, ఇంత చికాకు పడుతున్నావు? ఇప్పుడైనా నా మాట విను. నన్ను నమ్మి, నా వీపుమీదినుండి పాదాలను తీసేసి, కొంచెంసేపు నాకు దగ్గరగా కూర్చొని చూస్తూ ఉండు. క్షణంలో నా ఒళ్ళు నానుతుంది; కలకండ ముక్కల్లాంటి నా మాసపు ముక్కల్ని చకచకా తిని సంతోషంగా ఇంటికి పోదువు" అన్నది తాబేలు.

ప్రాణాలమీద తీపికొద్దీ తాబేలు పలికిన ఆ తీపి పలుకుల్ని పూర్తిగా విశ్వసించింది, ఆకలితో నకనకలాడుతున్న నక్క. తాబేలు వెన్నుమీద బలంగా మోపి ఉన్న పాదాల బరువును మెల్లగా సడలించింది. బరువు అటు తగ్గిందో లేదో, ఇటు జర్రున శరవేగంతో జారి లోతు నీళ్ళలోకి దూకి ప్రాణాలు దక్కించుకున్నది తాబేలు."

కోతి మొసలికి ఆ కథ చెప్పి, "ఓ నీచపు మొసలీ! మోసకారులకే మోసకారి అయిన నక్కే తాబేలు చేతిలో అంతలా మోసపోయిందే, ఇక పుట్టుకతోటే చూపు సరిగా ఆననిదానివి, నువ్వు నా వల్ల మోసపోవటంలో ఆశ్చర్యం ఏమున్నది? చాలు చాలు. నీతో స్నేహం చేసినందుకు మంచి ఫలితమే దక్కింది. ఇంక నీ స్నేహాన్ని నీ దగ్గరే ఉంచుకో- (...అని ఇంకా ఏం చెప్పిందో మళ్ళీ చూద్దాం!)



## సైన్సు సంగతులు

1. సముద్రపు సగటులోతు 3600మీ. అంటే 3.6 కిలోమీటర్లన్నమాట!
2. లోతైన సముద్రపు ప్రాంతంలో ఎవరెస్టు పర్వతాన్ని పూర్తిగా ముంచేయవచ్చు!
3. సూర్యకాంతి సముద్రంలో 73మీ లోతు వరకు మాత్రమే చొచ్చుకుపోగలదు!
4. 'ప్లూటో' గ్రహ విస్తీర్ణం 'రష్యా' విస్తీర్ణం కంటే తక్కువ!

*సేకరణ: శ్రీ వి వి యస్ మూర్తిగారు, చొదిమెళ్ళ, ప.గో.జిల్లా*



# ధైర్యం!

*మూలం : జి. మీనాక్షి, పాట్లూరు.*
*మార్పు చేర్పులు: కొత్తపల్లి*

రామయ్యకు సంపద ఏమంత లేకపోయినా, మంచితనం మాత్రం చాలానే ఉంది. అతనికి ఒక్కడే కొడుకు- పేరు రాము. రాము చాలా మంచివాడు, తెలివైన వాడు కూడా.

అదే ఊళ్లో ఉండే విశ్వ ధనవంతుడు; కానీ అతను బలే పిరికివాడు, స్వార్థపరుడున్నూ. విశ్వా కొడుకు అజయ్‌కి అదృష్టవశాత్తు తండ్రి పోలికలు రాలేదు. అజయ్ కూడా రాము వాళ్ళ స్కూల్ లోనే చదువుకుంటున్నాడు. ఇద్దరూ మంచి స్నేహితులు; ఇద్దరూ ఇతరులకు సహాయపడేవాళ్ళు.

ఒకరోజున విశ్వ, అజయ్ ఇద్దరూ కాలినడకన పొరుగూరుకు బయలుదేరారు. ఆ సరికి సాయంత్రం కావస్తున్నది. ఊరి చివర్లో ఉన్న తాటి చెట్ల దగ్గరికి రాగానే అకస్మాత్తుగా ఓ పెద్ద ఆకారం వాళ్ళ ముందుకు దూకింది: "ఏయ్! ఎవర్రా అది?! మర్యాదగా మీ పేరు చెప్పండి! లేదా ఇవాల్టితో మీ పని సరి" అన్నది. చూసేందుకది మనిషి లాగా లేదు; అలాగని మనకు తెలిసిన జంతువు లాగానూ లేదు. ఎక్కడినుండి దూకిందో మరి, తెలియలేదు. దాని గొంతు మటుకు బరకగా, మగ మనిషి గొంతులాగా ఉంది.

"న్.న్.న్.నాపేరు విశ్వ. వీడు నా కొడుకు అజయ్" వణికిపోతూ చెప్పాడు విశ్వ.

"ఉంc.. ఒక్కడు దొరికాడన్నమాట. ఇదిగో ఒరే పిల్లాడా! మీ నాన్నని చూస్తే కరకరా నమిలి తినబుద్ధవుతున్నది, కేవలం నిన్ను చూసి ఆగుతున్నాను గానీ. ముందు నువ్వు ఒక పని చెయ్యాలి. మీ నాన్నని నాకిచ్చేసి వెనక్కి తిరిగి చూడకుండా ఇంటిదారి పట్టు. నీకు ఎవరైనా మంచి స్నేహితులున్నారా?" అని అడిగింది ఆకారం.

"ఉన్నాడు..రాము!" అన్నాడు అజయ్.

"ఊc.. దొరికాడు రెండోవాడు కూడా. సరే, నువ్వెళ్ళి వాడిని వెంటబెట్టుకు రా, త్వరగా! అంతవరకూ మీనాన్న ఇక్కడ కూర్చొని నాకు కథలు చెబుతుంటాడు" అన్నాడు ఆకారం వాడు.

"వాడిని పట్టుకొస్తే మమ్మల్ని వదిలేస్తావా? ఒరే, పోయి ఆ రాముగాడిని పిల్చుకొచ్చెయ్యిరా. ఈ రాక్షసుడికి వాడిని ఇచ్చేసామంటే మన దారిన మనం పోవచ్చు-" అన్నాడు విశ్వ, కొడుకును ఊరి వైపుకు నెడుతూ.

"ఉహుc. అట్లా కుదరదు. నీకు కావాలంటే మా నాన్నను ఉంచేసుకో. నేను మాత్రం రామును నీకు అప్పగించేది లేదు!" అన్నాడు అజయ్ మొండిగా.

"మీ నాన్నలాంటి వాడితో నాకూ పని లేదు. అందుకని నువ్వు నాతో ఉండిపో. మీ నాన్నని ఊళ్ళోకి పంపిస్తా" అని ఆ ఆకారం వాడు అజయ్‌ని పట్టుకొని, విశ్వని వదిలేశాడు.



విశ్వ "ఓ..రాక్షసుడు!" అని మొత్తుకుంటూ ఊళ్ళోకి పరుగు పెట్టాడు. ఊళ్ళో అందరూ అతన్ని "ఏమైంది?" అని అడిగేవాళ్ళే తప్ప, ఒక్కళ్ళూ ముందుపడి 'నేను నీకు సాయం

చేస్తాను' అనలేదు.

అంతలో విశ్వకు రామయ్య ఎదురయ్యాడు. విశ్వ కొడుకును రాక్షసుడు పట్టేసుకున్నాడని వినగానే రామయ్య విశ్వతో "పద, నేనూ వస్తాను నీతో. ఇద్దరం కలిసి వాడి పని పడదాం!" అన్నాడు.

"కాదట! వాడికి నీ కొడుకు కావాలట! వాడినీ రమ్మను!" అన్నాడు విశ్వ. అంతలోనే అక్కడికి చేరుకున్న రాము "పద నాన్నా! అసలు మనిద్దరం చాల్లే. ఈయనెందుకు? నువ్వు ఇంటికి పో, విశ్వ మామా! నేను-నాన్న వెళ్ళి అజయ్‌ని ఏదో ఒకరకంగా విడిపించుకు వస్తాంలే!" అన్నాడు.

"అవునవును. అదే మంచిది. ఇంట్లోవాళ్ళు నీకోసం కలవర పడుతున్నారేమో పోయి చూడు-!" అన్నాడు రామయ్య వెటకారంగా. పిరికి విశ్వ చటుక్కున కొడుకు సంగతి వదిలేసి, "సరే, మీరు ఎలాగంటే అలాగ-కానివ్వండి!" అంటూ ఇంటిదారి పట్టాడు!

అట్లా విశ్వ ఇంటికి వెళ్ళగా రామయ్య, రాము ఇద్దరూ తాటి చెట్ల దగ్గరికి చేరుకున్నారు.

ఆ సరికి రాక్షసుడు, రాజేష్ ఇద్దరూ ఎంచక్కా ఎదురెదురుగా కూర్చొని ఉన్నారు! రాజేష్ ముఖం ప్రసన్నంగా ఉంది! రాక్షసుడు మటుకు భోరు భోరుమని ఏడుస్తున్నాడు. కళ్ళలోంచి కారిన నీళ్ళు వాడి ముఖం మీద చారికలు కట్టి ఉన్నాయి!

"ఏయ్ఁ! మర్యాదగా మా పిల్లాడిని వదిలిపెడతావా, లేక నిన్ను ఇప్పటికిప్పుడు భూస్థాపితం చేయమంటావా?" దూరం నుండే హుంకరించాడు రామయ్య, క్రిందికి వంగి ఓ గులకరాయిని చేతిలోకి తీసుకుంటూ.

"అయ్యో! పాపం అతన్ని ఏమీ అనకండి మామా! కొడుక్కి బాగాలేదని ఇప్పటికే అతను బాధలో ఉన్నాడు" అడ్డం వచ్చాడు రాజేష్.

రామయ్య రాజేష్‌కేసి వింతగా చూశాడు.

"అవును మామా! ఇతను మంచివాడే- తన పేరు 'హు హు'- వింధ్యపర్వతాల నడుమన ఉన్న అడవిలో వీళ్ళ జాతివాళ్ళు ఏ కొద్దిమందో మాత్రం ఉన్నారట. రాక్షసుల్లాగా పెద్ద పెద్ద శరీరాలుంటాయి వీళ్లకి- అయినా

వీళ్లు మాంసం తినరు- మనలాంటి మనుషులే కద, వీళ్ళూనూ!

అయితే పాపం, ఇతని కొడుక్కి ఏదో పెద్ద జబ్బు చేసిందట. ఉత్తరం వైపున ఉన్న పర్వతాలలో దానికి కావలసిన మందుమొక్క ఉందని, ఇతను ఇలా మన ఊరివైపుకు వచ్చాడు. అయితే ఆ మందుమొక్కను ఎవరైనా మంచి స్నేహితులు ఇద్దరు వెళ్ళి కోసుకొస్తే తప్ప, అది పనిచెయ్యదట- అట్లా అని వాళ్ళ నమ్మకం! అందుకని ఇతను ఎవరైనా ఇద్దరు పిల్లలు దొరుకుతారేమోనని వెతికాడు- అంతే తప్ప, పిల్లల్ని ఎత్తుకెళ్దామని కాదు" వివరించాడు రాజేష్.

ఆ పెద్ద ఆకారంవాడు రామయ్యకు నమస్కారం పెట్టాడు. రామయ్య ప్రాణం కుదుటపడ్డది- "సరేలే. మరి నేను వీడితోబాటు ఇక్కడ కూర్చుంటాను; మీరు వెళ్ళి వాడికి కావలసిన మూలిక ఏదో తెచ్చి ఇచ్చెయ్యండి" అన్నాడతను పిల్లలతో.

రాక్షసుడి చేత గుర్తులు చెప్పించుకొని రాజేష్, రాము ఇద్దరూ ధైర్యంగా అడవిలోకి బయలుదేరి పోయారు.

కొద్ది సేపట్లోనే వాళ్లకు కావలసిన మూలిక దొరికింది. దాన్ని తెచ్చి ఇచ్చేసరికి అతనికి ఎక్కడలేని అనందం కలిగింది.



వీళ్ళిద్దరినీ భుజాలమీద ఎక్కించుకొని నాట్యం చేసినంతపని చేశాడతను! అటుపైన రామయ్యకు వంగి వంగి నమస్కారాలు పెట్టి, అతను మూలిక తీసుకొని తన తావుకు తను పోయాడు.

"ఇంతమాత్రానికి ఎందుకురా, మీ నాన్న అంత గందరగోళపడ్డాడు?" అడిగాడు రామయ్య, రాజేష్‌ను.

"పిరికితనం మామా!" నవ్వాడు రాజేష్.





# గోబెల్ ప్రైజు ఎలా కొట్టాలి?

*వెటకారం, నవ్వు కలగలిపిన ఈ కథ నచ్చాలంటే మీరూ ఏ ఎనిమిదో తరగతో దాటి ఉండాలేమో, ఐనా చదివి చూడండి! 'తప్పులు చేయండి' అని చెబుతున్నాడుగా, రవితేజన్న?...*
*మూలం: కె. రవి తేజ, 9 రోస్, అరవింద స్కూలు, కుంచనపల్లి, గుంటూరు జిల్లా.*
*మార్పు చేర్పులు: కొత్తపల్లి*

ప్రొఫెసర్ రవితేజకు, వాళ్ళ అన్న కృష్ణతేజకు కలిపి ఈమధ్యే రసాయన శాస్త్రంలో గోబెల్ ప్రైజు వచ్చింది. కృష్ణతేజ ఎవరికీ అందుబాటులో లేరుగానీ, రవితేజ మటుకు మీడియాకు దొరికారు. "మీకు రసాయన శాస్త్రం అంటే ఇష్టం ఎలా మొదలయింది?" అని ఓ విలేఖరి అడిగితే, ఆయన కళ్ళు అరమూసి, చిరునవ్వు మోముతో, అలనల్లన కదిలే వెంట్రుకలతో, మెలమెల్లని స్వరంతో ఇలా చెప్పారు:

నేను ఇంకా చాలా చిన్న పిల్లవాడిగా ఉన్న రోజులవి. మా అన్న నాకంటే ఐదేళ్ళు పెద్ద. ఒకరోజున నేను, మా అన్నయ్య ఇద్దరం సైన్సు అకాడమీకి వెళ్ళాము. అక్కడ సీసాలనిండా రకరకాల రసాయన పదార్థాలు పెట్టి ఉన్నాయి. ఆ అకాడమీ ప్రత్యేకత ఏంటంటే, దాన్ని చూసేందుకు వచ్చిన పిల్లలు ఎవరైనా సరే, అక్కడున్న రసాయనాలతో చేతనైన ప్రయోగాలు చేసుకోవచ్చు. అప్పుడు నేను మా అన్నయ్యకు చెప్పాను- "ఒరే అన్నయ్యా! మనం ఇద్దరం కలిసి ఒక చిన్న రాకెట్టు

తయారుచేద్దాంరా" అని. మా అన్నయ్య సరేనని, చుట్టూ వెతికాడు. అక్కడ చెత్త ఎత్తేసేందుకు ఒక అట్టముక్క కనిపించింది; చెత్త బుట్టలో దాదాపు ఐపోయిన ఒక తుమ్మబంక ట్యూబు, ఓ గట్టి పుల్ల, బ్లేడు ముక్క- ఇవన్నీ దొరికాయి. నేను ఎట్లా చేయాలో చెబుతూ ఉంటే, మా అన్న పాపం, శ్రమపడి ఒక రాకెట్టు తయారు చేసాడు.



సరే, ఇక అందులో కూరేందుకు పొడి కావాలి కదా. నేను చుట్టూ చూశాను- హెచ్ సి యల్, సల్ఫ్యూరిక్ ఆసిడ్, పెట్రోల్, డీజిల్, మాంగనీసు డై ఆక్సైడ్, కాల్షియం హైడ్రాక్సైడు, అమ్మోనియా- ఇట్లా ఏవేవో రసాయనాలున్నాయి. నేను, మా అన్న ఇద్దరం ఒక బీకరు తీసుకొని, అన్ని రసాయనాలనూ ఒక్కో చెంచా మందం అందులో వేసుకుంటూ పోయాం. అన్నీ ఐపోయే సరికి నాకు జోరుగా మూత్రం వచ్చింది- యూరినల్లో ఉండగా మరో ఐడియా కూడా వచ్చింది- ఒక చెంచాడు మూత్రం కూడా తెచ్చి బీకర్లో కలిపాను! ఇట్లా మేం ఇద్దరం మా తెలివితేటల్ని కలుపుకుంటూ పోయాం, చివరికి బీకర్లో నల్లటి బంకలాంటి పదార్థం తయారైంది. దాన్ని రాకెట్టులో నింపితే అందులో కేవలం ఒక్క చెంచాడు మాత్రమే పట్టింది!

అయ్యో, మిగిలిందంతా వృధా అవుతున్నదే అని బాధ పడ్డాడు మా అన్నయ్య. నేను అన్నాను "బాధ పడద్దురా, అన్నయ్యా! మనం కనుక్కున్న ఈ పదార్థం మరెవ్వరూ ఇంతవరకూ కనుక్కోనిది. ఈ రాకెట్టు ఎగిరిందంటే, ఇంకా చాలా రాకెట్లు తయారు చేయాల్సి ఉంటుంది మనం. దానికి ఇది అవసరమేలే" అని ఓదార్చి, రాకెట్టుకు ఒత్తిగా ఓ కాగితం ముక్కను పెట్టి,

అంటించాను.

ఇంకేముంది? ఆ రాకెట్టు పేలింది! అక్కడున్న రసాయనాలన్నీ అంటుకున్నై. ఎక్కడెక్కడో ఉన్న సైరన్లన్నీ మోగినై. పోలీసులు, అగ్నిమాపక దళం వాళ్ళూ అందరూ పరుగు పరుగున వచ్చేసి, నేలమీద పడి వణుకుతున్న నన్నూ, మా అన్ననూ ఇద్దర్నీ తీసుకెళ్ళి ఆసుపత్రిలో చేర్చారు.



ఎవరెవరో శాస్త్రవేత్తలట, నాయకులట- వచ్చి, "ఓరి పిల్లలూ, మీరు పిల్లలు కాదురా! అపర మేధావులు! ఎంతో అద్భుతమైన అణుబాంబును అంత తక్కువ ఖర్చుతో కనిపెట్టారు. మీ కృషివల్ల ఇంక వేరే ఎవ్వరికీ రసాయన శాస్త్రంలో కృషే చెయ్యాల్సిన అవసరం లేకుండా పోయింది. సైన్సు సెంటర్లో రసాయన శాస్త్ర పరిశోధనశాలనే ఎత్తేశారు- నిజానికి మీ కృషి ఎంత గొప్పదంటే, మీరు రాకెట్టు పేల్చాక ఇక ఆ ప్రాంతంలో ఎత్తేసేందుకు వీలుగా ఉండేదంటూ ఏదీ మిగలనే లేదు!" అని మెచ్చుకున్నారు. మాలాంటి పిల్లల మేధస్సుకి ఆనాడు పెద్దవాళ్ళు ఎంత అసూయ పడ్డారంటే, ప్రపంచంలోని అన్ని ప్రయోగశాలల్లోనూ రసాయనాలను ఇక మళ్ళీ పిల్లలెవ్వరికీ అందనంత ఎత్తులో- తాళాలు వేసిన అలమారల్లో తప్ప పెట్టుకోలేదు!

అట్లా మొదలైంది, రసాయనశాస్త్రంలో మా కృషి. తర్వాత మేం ఇద్దరం బాగా చదువుకొని, శాస్త్రవేత్తలుగా ఉద్యోగాలు సంపాదించుకొని, ప్రయోగశాలలు సొంతంగా ప్రారంభించి, ఆ మందుగుండు మిశ్రమాన్ని మళ్ళీ తయారు చేసేందుకు నడుం బిగించాం. ఇది నలభై సంవత్సరాల నాటి మాట. అయితే ఎంత ప్రయత్నించినా మళ్ళీ ఆ మిశ్రమం మటుకు తయారే అవ్వలేదు!

పెద్దయ్యాక మేం చేసిన ఏ మిశ్రమమూ అసలు పేలనే లేదు! ఏం చెయ్యాలి చెప్పండి?-

చివరికి ఇన్నేళ్ళ తర్వాత, మా మిశ్రమాల్లో ఒకటి- పందుల్లో పాల ఉత్పత్తిని విపరీతంగా పెంచుతున్నట్లు కనుగొన్నాక, మాకిద్దరికీ గోబెల్ ప్రైజు ఇచ్చారు. వింత ఏంటంటే, ఆ మిశ్రమం మరే ఇతర జంతువులమీదా కొంచెం కూడా ప్రభావం చూపట్లేదు!

కాబట్టి, నేను చెప్పేదేంటంటే, తప్పులు జరగడం సహజమే. అందుకని అందరం తప్పులు చేస్తూ ఉండాలి. తప్పుని పెద్ద తప్పుగా భావించి ఇంకా తప్పులు చేయకుండా ఉండటం తప్పు. మనం చేయాల్సిందల్లా ప్రతి తప్పు వల్లా కలిగే నష్టాలను అన్నిటినీ జాగ్రత్తగా గమనిస్తూ పోవటం! ఆ నష్టాల్లోనే మన లాభాలూ దాగి ఉండొచ్చు మరి!

అర్థమైందా? కనుక మీరందరూ పెద్ద పెద్ద తప్పులు చేసి ఒక్కొక్కరూ ఒక్కో గోబెల్ ప్రైజు సంపాదిస్తారని ఆశిస్తూ, సెలవు. ✷

**తారంగం తారంగం**

తారంగం తారంగం
తాండవ కృష్ణ తారంగం
వేణు వినోదా తారంగం
వెన్నల దొంగ తారంగం
చిన్ని కృష్ణా తారంగం
చిన్నారి కృష్ణా తారంగం

*సేకరణ: M. ఐశ్వర్య, ఐదవతరగతి, M.P.P. స్కూల్, దాసరి స్ట్రీట్, గుత్తి, అనంతపురం జిల్లా.*

**అమ్మ**

లోకంలో అమ్మ ప్రేమ చాలా విలువైనది.
అది అందరికీ దొరకని ఒక వజ్రం-
వెలకట్టలేని ఒక నాణెం
చేయలేని ఒక యుద్ధం (?)
అపస్వరం లేని రాగం
మరువలేని ఓ జ్ఞాపకం.

*రచన : M. ప్రణీత, పదవతరగతి, తేజ విద్యాలయ, కోదాడ.*





# కూరలబ్బాయి

*'నిజంగా చూస్తే మంచితనం వల్ల నష్టమేమీ రాదు' అని ఈ సంఘటనను రాసి పంపాడు అనీష్. దీని అంతం మాది- చదివి ఎలా ఉందో చెప్పండి మరి.*

*రచన: అనీష్ మండలీక, ఎనిమిదవ తరగతి, రిషి వ్యాలీ స్కూల్, మదన పల్లి, చిత్తూరు జిల్లా.*



వేసవి సెలవులకి అమ్మమ్మ వాళ్ళ ఇంటికి వచ్చాడు భాస్కర్. అమ్మమ్మ పేరు ఈశ్వరమ్మ. ఈశ్వరమ్మ, వాళ్ళ పక్కింటి ప్రమీలమ్మ మంచి స్నేహితులు. రోజూ ఒక కూరలబండి అతను వాళ్ల ఇంటిముందు ఆగి పిలిచేవాడు. వీళ్ళిద్దరూ క్రమం తప్పకుండా రోజూ అతని దగ్గరే కూరలు కొనేవాళ్ళు. ఆ కూరలమ్మే అతను ఎంత మంచివాడో, అతను అమ్మే కూరలు ఎంత బాగుంటాయో, అతని దగ్గర కూరగాయల ధరలు ఎంత తక్కువో రోజంతా అందరికీ చెప్తుండేవాళ్ళు వీళ్ళు.

అయితే ఈసారి భాస్కర్ వచ్చేసరికి అమ్మమ్మ, ఈశ్వరమ్మ కొంచెం మారినట్లు అనిపించారు-కూరలతని గురించి ఎక్కువ మాట్లాడలేదు. భాస్కర్ తనే కల్పించుకొని

అడిగితే "ఒరేయ్ భాస్కర్, ఆ రోజు ఏమి జరిగిందో తెలుసా?" అంది అమ్మమ్మ.

"ఏరోజు, ఏమి జరగడం అమ్మమ్మా?" అడిగాడు భాస్కర్.

"అయ్యో! నీకు తెలియదా, ఇదిగో చెప్తాను- రెండు నెలల కిందట నేను, మన ప్రమీలమ్మ మామ్మ కూరల వాడి కోసమే ఎదురు చూస్తున్నాము గదా, చూడగా చూడగా ఆఖరికి అతను వచ్చాడు. కూరలు కొనేశాక చూస్తే ప్రమీలమ్మ మామ్మ డబ్బులు తెచ్చుకోలేదు. సరేనని డబ్బు కోసం ఆవిడ, నేను ఇద్దరము లోపలికి వెళ్ళాం.." ఆపింది అమ్మమ్మ. అమ్మకు ఇట్లా ఆపి ఆపి కథలు చెప్పటం అంటే ఇష్టం.

"మరేమైంది అప్పుడు?" అడిగాడు భాస్కర్.

"ఏముంది, నేను డబ్బు పట్టుకొని బయటికి వెళ్ళానా, ఆసరికి ప్రమీలమ్మ గారు అక్కడే నిలబడి కళ్ళనీళ్ళు పెట్టుకుంటున్నారు! నేను అడిగాను- 'ఏమి అయింది, కూరలవాడేడి?" అని.

"డబ్బులకోసం నేను ఇంట్లోకి వెళ్ళాను గదండి; ఇంట్లో కొంత చిల్లర, ఒక 500 రూ. నోటు దొరికాయి. దానితో నా కూరలు, మీకూరలు కూడా కొనేశాను" అన్నారావిడ.

"మరి ఇక్కడ బాధగా నిలబడ్డారెందుకు?" అడిగాను. "అయ్యో, అదే కదా చెబుతున్నది?! చిల్లరతో బాటు ఐదు వందల రూపాయల నోటును కూడా వాడి చేతికి ఇచ్చాను. మళ్ళీ చూసుకునేసరికి కూరగాయల వాడు లేడు- ఎటు పోయాడో పోయాడు- మిగిలిన డబ్బులు ఇవ్వనే లేదు!" అన్నారావిడ.

"అయ్యో! మరి ఏం చేశారింక?" అడిగాడు భాస్కర్.

"నాలుగు రోజుల తర్వాత ఆ కూరలతను వచ్చాడు- ఈసారి అతని వెంట అతని కొడుకు, పదేళ్లవాడు- వాడు కూడా వచ్చాడు. అప్పుడు మేము నోటు గురించి అడిగాం. ఆ కూరలతను ఏమన్నాడో తెలుసా?- 'ఏ నోటు గురించి మాట్లాడుతున్నారమ్మా?' అని అడిగాడు! ప్రమీలమ్మగారి ముఖం తెలవెలపోయింది. "అదేనయ్యా, పోయిన సారి వచ్చినప్పుడు ఈ ప్రమీలమ్మగారు ఇచ్చిన నోటు!"

అన్నాను నేను-

"అయ్యో, నాకు ఎక్కడ ఇచ్చారమ్మా?! చిల్లర తెచ్చి ఇచ్చారు; నేను దాన్ని తీసుకొని ముందుకు పోయాను. అయినా నా దగ్గర ఐదు వందలకు చిల్లర ఎక్కడుంటుందమ్మా, ఎవరు కొన్నా పదివో పద్దైదువో కూరగాయలు కొంటారు- నా దగ్గర అంతలేసి నోటుకు చిల్లర ఉంటుందా?' అనేశాడు అతను!"

"మర్చిపోయి ఉంటాడు అమ్మమ్మా!" అన్నాడు భాస్కర్.

"ఏం మరపో- తిరిగీ తిరిగీ ఇదంతా ప్రమీలమ్మ మీదికి వచ్చింది. ఆవిడ ఒకటే బాధ పడటం- తర్వాత ఏమైందో తెలుసా?"

"ఏమైంది?"

"మేం అట్లా ఊరికే నిల్చుండిపోయాం. కూరలతను సందుదాటి వెళ్ళిపోయేవరకూ అతన్నే చూస్తూ.

కొద్ది సేపటికి ఆ కూరలతని కొడుకు ఒక్కడే వెనక్కి వచ్చాడు- మెల్లటి గొంతుతో చెప్పాడు- 'మామ్మగారూ, నాలుగు రోజుల క్రిందట నా పుట్టిన రోజు అయ్యిందండి- ఆ రోజున, ఎన్నడూ లేనిది, మా నాన్న నాకు ఒక ఐదువందల రూపాయలు బహుమతిగా ఇచ్చాడండి. నేనూ, మా అమ్మా ఇద్దరం ఆశ్చర్యపోయామండి. మా అమ్మ దాన్ని భద్రంగా తీసి పెట్టిందండి- అది మీరు ఇచ్చిన నోటే అయి ఉంటుంది. నేను మా అమ్మకు చెప్పి, రేపు ఈ వేళకల్లా దాన్ని తెచ్చి ఇస్తానండి- మీరు కంగారు పడద్దు' అని.

అన్నట్టే మరునాడు ఐదువందల నోటు తెచ్చి ఇచ్చాడు ఆ పిల్లవాడు!" అన్నది అమ్మమ్మ.



"వావ్! భలేవాడు దొరికాడే" ఆ పిల్లవాడి నిజాయితీని మెచ్చుకున్నాడు భాస్కర్.

"వాడి పేరు సురేష్. ఇప్పుడు తెలుసా, రోజూ వాడు మన దగ్గర ట్యూషన్‌కి వస్తాడు.

వాడిని చూశాకే, నేనూ, ప్రమీలమ్మా ఈ ట్యూషన్ సెంటర్ మొదలెట్టింది. రోజూ సాయంత్రం ఎవరు వస్తే వాళ్లకి ఉచితంగా పాఠాలు చెబుతున్నాం ఇప్పుడు!" అన్నది అమ్మమ్మ.

-నిజంగా చూస్తే మంచితనం వల్ల నష్టమేమీ రాదు! పైపెచ్చు ఆ మంచితనం అంటుకొని మరి కొందరు మంచివాళ్ళు అవ్వచ్చు!

నవ్వు!

**నాన్న తెలివి!**

చింటూ: నాన్నా అందర్నీ నిద్రలేపేది సూర్యుడేనట కద నాన్నా!

నాన్న: అవునురా.

చింటూ: మరి సూర్యుడిని ఎవరు నిద్రలేపుతారు నాన్నా?

నాన్న(కొంచెం అనుమానంగా): కోడి కూత అయి ఉండచ్చురా, మీ టీచర్‌ని అడుగు.

**ఆధునిక జూ!**

రవి: నాన్నా, కటకటాలు అంటే ఏంటి నాన్నా?

నాన్న: కటకటాలు అంటే ఇనుముతో చేసిన గ్రిల్‌రా, జూలో బోను లాగా అన్నమాట.

రవి: అన్నవాళ్ల బడిలో కూడా కటకటాలుంటాయి కదు నాన్నా?

నాన్న: ఆఁ!!

**సద్వినియోగం!**

సుబ్బారావు: ఏం వెంగళప్పా, మాటి మాటికీ వాచీకేసి చూసుకుంటున్నావు? వేరే పనేం లేనట్లు, అన్ని సార్లు వాచీకేసే చూస్తూండటం సమయం వృధా కద?!

వెంగళప్ప: అదేమరి, సమయం ఎంత వృధా అవుతున్నదో చూస్తున్నాను వాచీలో.



# మాట్లాడే చేప

ఆంగ్ల జానపద కథ

*అర్థం లేనట్లు కనబడే జానపద కథల్లో అంతర్లీనంగా నిగూఢమైన అర్థాలు ఉంటాయల్లే ఉంది.. సుజాత రాసి పంపిన ఈ కథ ఏం చెబుతున్నది..?*

*సేకరణ, కథనం: కె. సుజాత, ఐదవ తరగతి, దాసరి వీధి, గుత్తి మండలం, అనంతపురం జిల్లా.*



అనగనగా ఓ సముద్ర తీర గ్రామంలో బీదవాడు ఒకడు ఉండేవాడు. ఒక రోజున వాడు చేపలు పట్టడానికి వెళ్లాడు. ఆరోజున వాడికి అసలు ఏ చేపలూ దొరకలేదు. చాలా సార్లు వల వేయగా వేయగా, చివరికి ఓ చిన్న-అందమైన చేప ఒకటి అతని వలలో పడింది. బీదవాడు ఆ చేపను వలలోంచి బయటికి తీయబోయాడు.

ఆకస్మాత్తుగా చేపపిల్ల మానవ కంఠంలో మాట్లాడటం మొదలెట్టింది-

"చూడు అన్నయ్యా, నేను ఏదో ఆడుకుంటూ ఏమారిపోయి నీకు దొరికి పోయాను. మా అమ్మవాళ్ళు నాకోసం బెంగ పడుతుంటారు. నేనా, ఇంత చిన్నదాన్ని- నన్ను ఎవరు కొనాలి, ఎంత డబ్బు ఇవ్వాలి, దాంతో నీకేం ఒరగాలి? నా మీద దయ చూపించు. నన్ను మళ్లీ నీళ్లలో పారెయ్యి" అని బతిమాలింది.



పేదవాడికి జాలేసింది. 'ఇంత చిన్న చేపని నేను ఏం చేసుకుంటానులే' అని, ఆ చేపని నీళ్లల్లో పడేశాడు. "అబ్బ! ఇంకెప్పుడూ చేపలు పట్టకూడదు. తినేందుకు కనీసం దొరక్కపోతే, ఇదేం వృత్తి?" అనుకున్నాడు. చేపలు పట్టే పని కాక వేరే ఇంకేంచెయ్యాలో తెలీక, విచారంగా ఇంటి దారి పట్టాడు.

అతను అట్లా నడిచిపోతుంటే, ఆకస్మాత్తుగా వాడికి ఒక పిశాచం కనిపించింది. ఆ పిశాచం ఒక చక్కని ఆవునొకదాన్ని తోలు కు వస్తోంది. "నమస్కారం అన్నయ్యగారూ! ఏదో విచారంగా కనబడుతున్నారు?" పలకరించింది పిశాచం.

పేదవాడు తన కథంతా చెప్పాడు. "ఇంక ఈ రోజు నుంచి ఎలా బతకాలో తెలియడం లేదు" అని వాపోయాడు.

ఆ పిశాచం అన్నది "చూడు అన్నయ్యా! ఈ ఆవుని మూడు సంవత్సరాలు నీ దగ్గరే అట్టే పెట్టుకో. ప్రతిరోజూ ఈ ఆవు మీకిద్దరికీ కావలసినన్ని పాలు ఇస్తుంది. నీకు-నీ భార్యకు ఆకలి బాధ ఉండదు.

అయితే ఒక షరతుంది. మూడు సంవత్సరాలు అయిన తర్వాత నేను వచ్చి నిన్ను కొన్ని ప్రశ్నలు అడుగుతాను. సరైన సమాధానాలు ఇవ్వగలిగావా, ఈ ఆవు నీదే.

సరైన సమాధానాలు ఇవ్వలేకపోతే మటుకు ఆవునీ, దానితో బాటూ మిమ్మల్నిద్దర్నీ కూడా- తీసుకుపోతాను! ఆలోచించి, ఏమాటా చెప్పు!" అంది.

"ఆకలితో మాడే కంటే ఆవుని తీసుకోవడమే మంచిది కదా" అనుకున్న పేదవాడు 'సరే' అన్నాడు. పిశాచం షరతుకు ఒప్పుకొని, ఆవుని తీసుకొని ఇంటికి వెళ్లాడు. ఆవు సహాయంతో పేదవాడు, అతని భార్యా ఆకలి బాధ తెలీకుండా సుఖంగా బ్రతికారు. మూడు సంవత్సరాలు ఇట్టే గడచిపోయాయి. పిశాచం ఇచ్చిన గడువు దగ్గర పడింది.

దానికి గడువు సంగతి గుర్తుంటుందా, ఉండదా, అది ఏం ప్రశ్నలడుగుతుంది, ఏం జవాబులివ్వాలి, అది తమని తినేస్తే ఎలాగ- అని గుబులు మొదలైంది ఇద్దరికీ. పిశాచం ఇచ్చిన గడువు ఇంక రేపు ముగుస్తుందనగా ఆ రోజు సాయంత్రం ఓ చక్కని అందమైన యువకుడు వాళ్ల దగ్గరకు వచ్చాడు. "నేను చాలా అలసిపోయి ఉన్నాను- చీకటి పడుతోంది. ఈ రాత్రికి మీ ఇంట్లో ఉండటానికి అనుమతివ్వండి, ప్లీజ్" అని అడుగుతూ.

"మాకేమీ అభ్యంతరం లేదు బాబూ! కానీ నీకే ఇబ్బంది అవుతుందేమోనని ఆలోచిస్తున్నాం. మూడేళ్లకు ముందు మేం ఒక పిశాచం దగ్గర ఓ ఆవును తీసుకున్నాం. ఇన్నాళ్లపాటు ఆ ఆవు చలవన సుఖంగా జీవించాం. అయితే ఆవుని ఇచ్చిననాడే పిశాచం కొన్ని షరతులు పెట్టింది- మూడేళ్ల తర్వాత వచ్చి కొన్ని ప్రశ్నలు అడుగుతానన్నది. ప్రశ్నలకు సమాధానం చెబితే ఆవు మాదేనట! చెప్పలేకపోతే ఆవుతో పాటు మమ్మల్నికూడా తీసుకెళ్తుందట అది!" చెప్పారు అతనికి.

యువకుడు నవ్వాడు- "అంతేకదా! ఈ పూటకు నన్ను మీతోబాటు ఉండనివ్వండి. పిశాచం అడిగే ప్రశ్నలకు వీలైతే నేనే సమాధానం ఇస్తాను" అన్నాడు ధైర్యంగా.

సరిగ్గా అర్థరాత్రి అయ్యే సరికి పిశాచం వచ్చి తలుపు తట్టింది- "మూడు సంవత్సరాలు అయిపోయింది. ఇప్పుడు నా ప్రశ్నలకు సమాధానం కావాలి" అంది.

"నీ ప్రశ్నలేవో అడుగు- సమాధానం చెబుతాను" అన్నాడు కొత్తగా వచ్చిన యువకుడు.

పిశాచం కొత్త గొంతు విని- "నువ్వెక్కడ నుంచి వచ్చావు?" అంది.

"సముద్రంలోంచి" అన్నాడు యువకుడు.

"ఇక్కడికెలా వచ్చావు?" అంది పిశాచం.

"ఎట్లా వచ్చాననుకుంటివి, ఈగ నెక్కి!" అన్నాడు యువకుడు నవ్వుతూ.

"అయితే సముద్రం అంత చిన్నదా?"

"అంత చిన్నదేం కాదు, డేగ కూడా దాన్ని ఈ పక్కనుంచి ఆ పక్కకి ఎగరలేదు" అన్నాడు యువకుడు.

"ఓహో- డేగదేమున్నది, ఏమీ చేతగాని పిట్ట!" అన్నది పిశాచం.

"అదేం మాట. ఎంత మాత్రం కాదు. దాని రెక్కల నీడ ఒక మహానగరాన్ని కప్పేస్తుంటే, అదేం చిన్న?" అన్నాడు యువకుడు.

"బొమ్మ పట్టణాలు చాలా చిన్నగా కూడా ఉంటైలే" అన్నది పిశాచం.

"అహాఁ అట్లాంటిదేమీ కాదు. పట్టణంలో ఆ మూలనుండి ఈ మూలకు పరుగెత్తాలంటే కుందేలు చేతనవుతుందేమి, వీలే కాదు"

"చిట్టి చిట్టి బొమ్మ కుందేలు ఏం పరుగు పెడుతుందిలే" అంది పిశాచం తీసి పడేస్తున్నట్లు.

"ఏం చిన్నది తల్లీ! దాని చర్మం ఓ ఇంటి కిటికీకి, దాని బొచ్చు ఒక మనిషి టోపీకి సరిపోతుంది!" అన్నాడు యువకుడు గట్టిగా.



"ఆ మనిషి ఏ మరుగుజ్జువాడో అయి ఉండాలిలే. ఎంత శబ్దమైనా వాడి చెవుల్లో పడదు కాబోలు"

"అట్లా ఏం కాదు. ఎక్కడో పర్వతాల్లో లేడి గడ్డి కొరికితే, ఆ శబ్దం కూడా అతనికి వినబడుతుంది"

ఇంక పిశాచానికి ఏం అడగాలో తోచలేదు. తలుపు దగ్గరే కొంత సేపు నిశ్శబ్దంగా నిల్చొని, చివరికి ఒక్కసారిగా మాయమైపోయింది. పేదవాడు, అతని భార్య చాలా సంతోషించారు.

ఇంక కొద్ది సేపట్లో తెల్లవారుతుందనగా ఆ యువకుడు పేద దంపతుల దగ్గర సెలవుతీసుకుంటూ "అయ్యా! నేనెవరో గుర్తుపట్టలేదు కదా, ఆ రోజు మీరు జాలిపడి నదిలో పారేసిన మాట్లాడే చేపను నేనే. మీ రుణం నాకు ఇవాళ్ల ఇట్లా తీరింది- సుఖంగా ఉండండి" అన్నాడు.

పేదవాడు ఇంకా ఆశ్చర్యంలోంచి తేరుకోకముందే ఆ యువకుడు కాస్తా అదృశ్యమయ్యాడు! 

నవ్వు!

**తెలివైన నాయకుడు!**

విలేఖరి: అయ్యా! మీరు ఇంత తక్కువలో ఇల్లు ఎలా కట్టుకోగలిగారు?

రాజకీయ నేత: నాకు రాళ్ల ఖర్చు, ఇటికల ఖర్చు లేదు కాబట్టి.

విలేఖరి: అదెలాగ?

రాజకీయ నేత: మొన్న జరిగిన ఎలక్షన్లలో జనాలు నామీద విసిన రాళ్ళు ఇటుకలు తీసి పెట్టాను. వాటితోటే ఇప్పుడు ఇల్లు కట్టుకుంటున్నాను మరి!

**ముందుచూపు!**

టీచర్: రవీ, సైన్సు వేగంగా అభివృద్ధి చెందుతున్నది కదా, 2020లో ప్రధాన సమాచారం ఏమై ఉండచ్చు, చెప్పు?!

రవి: అంగారకుడి మీదికి పంపిన రాకెట్టు ఇవాళ్ళ ఉదయం హైజాక్‌కి గురైంది..





# మాయమయ్యే కథ

*ముట్టుకుంటే బంగారమయ్యే కథనే ఇంకోలాగా- ఇదిగో ఇట్లా చెప్పచ్చు.....!*
*కథనం: వరుణ్, ఆరవ తరగతి, రిషి వ్యాలీ స్కూల్.*

అనగనగా ఒక రాజ్యంలో ఒక రాజు ఉండేవాడు. అతని పేరు రఘూత్తముడు. ఆయన మంచి రాజు. అయినా ఆయనకు తృప్తి లేదు. “ఈ లోకం ఎందుకు ఇలా చప్పగా ఉంది? నా చేతిలో ఏదైనా మ్యాజిక్ ఉంటే ఎంత బాగుంటుంది?!” అనుకుంటూ ఉండేవాడు ఆయన.

ఒక రోజు గంగా నదిలో స్నానం చేస్తుంటే ఆయనకు దేవుడు ప్రత్యక్షమయ్యాడు.

"ఒక కోరికను కోరుకో" అని అడిగాడు రాజును. రాజు కొంచెం ఆలోచించింది, "నేను తాకిందంతా మాయం అవ్వాలి" అని కోరాడు. దేవుడు "సరిగ్గా ఆలోచించుకున్నావా? అని అడిగాడు. “ఓం చాలా బాగా ఆలోచించుకున్నాను" అన్నాడు రాజు.

"అయితే సరే, తథాస్తు" అని మాయం అయిపోయాడు దేవుడు.

రాజు అప్పుడు ఇంక రాజ్యంలోకి వెళ్ళాడు. అంతలో రాజుగారి ప్రాణ స్నేహితుడు ఒకతను వచ్చాడు. అతని పేరు శివయ్య. రాజుగారు అతన్ని ఆప్యాయంగా కౌగిలించుకున్నారు. అంతే- రాజుగారి స్నేహితుడు కాస్తా మాయం అయిపోయాడు!

రాజుగారు చాలా బాధపడ్డారు. ఆయన అట్లా బాధగా కూర్చొని ఉండగా ఆయన సైనికుడు ఒకడు వచ్చి కొన్ని లడ్డూలు ఇచ్చి తినమన్నాడు. రాజుగారికి వాటిని చూడగానే నోరు ఊరింది. అయితే ఆయన లడ్డూలను తాకాడో లేదో- అవి మాయమయ్యాయి!

రాజుగారు మళ్ళీ బాధగా కూర్చున్నారు. తన చేతితో ఒక బంగారు కుండను తాకారు. తక్షణం అది కాస్తా మాయమయిపోయింది!

అంతలోనే రాజుగారు కూర్చున్న బంగారు కుర్చీ కూడా మాయమయిపోయింది.

రాజుగారి బాధకు అంతులేదు. మొదట తన ప్రాణ స్నేహితుడు, తర్వాత తన లడ్డూలు, బంగారు కుండ, బంగారు కుర్చీ- అన్నీ మాయమయిపోయాయి. ఇప్పుడు రాజుగారికి ఎక్కడ లేని ఆకలి! ఎక్కడా లేని దప్పిక! ఆకలి దప్పులంటే ఏమిటో తెలిసివచ్చాయాయనకు!



ఇట్లా కొద్ది రోజులు గడిచాయి. ఏం అనుకొని రాజు ఈ కోరికను కోరాడో గాని, ఇప్పుడు మటుకు ఆయనకు అదే శాపంగా తోచసాగింది.

ఇప్పుడాయన బక్కచిక్కిపోయాడు. కొంచెం సేపు కూడా ఎక్కడ మనసు నిలవకుండా అయ్యింది. ఎక్కడా కూడా కొంచెం సేపు

ఉండలేదు! దేన్నీ ముట్టుకోలేదు!

చివరికి వేసారిపోయారు రాజుగారు. మళ్ళీ ఓసారి భక్తి శ్రద్ధలతో దేవుడిని ప్రార్థించారు. దేవుడికి రాజుగారి మీద దయ కలిగింది. మళ్ళీ ప్రత్యక్షమయ్యాడు దేవుడు- "ఏమైంది?! అంతా బాగుందా? నువ్వు తాకినవన్నీ మాయం అవుతున్నాయా?" అని అడిగాడు చిరునవ్వుతో.

జరిగినదంతా చెప్పారు రాజుగారు.

దేవుడికి అర్థం అయ్యింది- రాజుగారి మనసు నిజంగానే మారింది. అందుకని ఆయన తన వరాన్ని తానే వెనక్కి తీసుకున్నాడు.

మరుక్షణం రాజు గారి ప్రాణ స్నాహితుడు, లడ్డూలు, కుండ, బంగారు కుర్చీ, అన్నం, నీళ్ళు అన్నీ తిరిగి వచ్చాయి.

రాజుగారు అంతులేని ఆనందంతో స్నేహితుడ్ని కౌగిలించుకున్నారు; లడ్డూలు తిన్నారు;, బంగారు కుర్చీ మీద మహారాజులాగా ఎక్కి కూర్చున్నారు. ఇప్పుడు రాజు చాలా ఆనందంగాఉన్నాడు! ఆయనకు లోకం చాలా బాగా కనిపిస్తోంది. మ్యాజిక్ మీద మోజు పోయింది.

ఆ రోజంతా రాజుగారు పేదలకు దానం చేస్తూనే ఉన్నారు. ఆ పైన ఏనాడూ గొంతెమ్మ కోరికలు కోరలేదు- తనకు ఉన్న వాటితో చాలా ఆనందంగా గడిపారు. ✷

నవ్వు!

**బద్ధకిస్టు!**

టీచర్: సురేష్, అకస్మాత్తుగా విద్యుత్‌శక్తి లేని పరిస్థితి ఎదురైందనుకో, అప్పుడు నువ్వేం చేస్తావు?

సురేష్: అప్పుడు నేను నా మెదడును ఉపయోగిస్తాను టీచర్!

టీచర్: అదేమి? ఇప్పుడు నీ మెదడును వాడట్లేదా?

సురేష్: ఎందుకు టీచర్, ఇప్పుడు కంప్యూటర్లు పని చేస్తాయి కదా!



# టిల్లు సాహసం

*రచన: బి. కార్తీక్, ఏడవ తరగతి, శాంతి నికేతన్ విద్యాలయ, జహీరాబాదు.*
*సౌజన్యం: మన లైబ్రరీ, జహీరాబాదు.*

టిల్లు అనే ఒక ఎలుక అందరితోటీ స్నేహ పూర్వకంగా మెలిగేది. ఎవరైనా ఆపదలో ఉంటే కాపాడడం, వాటి అవసరాలు తీర్చడం- లాంటివి చేసేది. దీంతో టిల్లు ఎలుకను అందరూ మెచ్చుకునేవాళ్ళు.

అయితే తోటి ఎలుకలకు ఇది నచ్చేది కాదు. రాను రాను వాటి అయిష్టత ద్వేషంగా మారింది. టిల్లును ఏదైనా ప్రమాదంలో ఇరికించాలనుకున్నాయి. అన్నీ కలిసి ఒక పన్నాగం పన్నాయి..

ఒక రోజున ఒక ఎలుక వచ్చింది టిల్లు దగ్గరికి-"టిల్లూ! నీకు తెలుసా?" అంటూ. "మన జంబుగాడు పిల్లిని చూసి జడుసుకున్నాడట. నిద్రలో ఉలిక్కి పడుతున్నాడు. తీవ్రమైన జ్వరం వచ్చింది. ఇట్లాగే మరో రెండు రోజులు గడిచాయంటే వాడింక బతకడని వైద్యులు చెప్పారు" అంది పథకంలో భాగంగా.

"అయ్యో! అలాగా!నాకు తెలీనే లేదే! ఇప్పుడెలాగట?! సానుభూతిగా అడిగింది టిల్లు.

"వాడి జ్వరం తగ్గాలంటే ఒక పిల్లి గోరును తెచ్చి వాడి మెడలో కట్టాలట. అంత సాహసం ఎవరు చేస్తారు చెప్పు? పాపం జంబుగాడు- ఇంక బతకడు! వాళ్ల అమ్మా వాళ్ళంతా వాడిమీద ఆశ వదిలేసుకున్నారు" అని దొంగ కన్నీరు కారుస్తూ వెళ్ళిపోయింది ఆ ఎలుక.

టిల్లూ మనసు కొంతసేపు నిశ్చేష్టం అయిపోయింది. తర్వాత తేరుకొని, "నేను చచ్చిపోయినా పర్లేదు- జంబూను మాత్రం బ్రతికించాలి" అనుకున్నది. అనుకొని, పిల్లి గోరు సంపాదించడానికి బయలుదేరింది.

కలుగు బయటనే కనబడింది పిల్లి. పడుకొని నిద్రపోతున్నది గుర్రు గుర్రుమంటూ.

నెమ్మదిగా దాని దగ్గరికి పోయింది టిల్లు. ముందు మెల్లగా దాన్ని నిమిరి చూసింది. పిల్లి కదల్లేదు. టిల్లుకు కొంచెం ధైర్యం వచ్చింది.

నేరుగా పిల్లి పంజా ముందే నిలబడింది. చప్పుడు కాకుండా పిల్లి గోరును కొరకటం మొదలెట్టింది.

నిద్రలో ఉన్న పిల్లికి ఎలుక వాసన వచ్చింది. నోట్లో నీళ్ళూరాయి. పంజా కొంచెం కొంచెం కదిలింది. మెలకువ వచ్చింది-



చటుక్కున కదిలి అదే పంజాతో టిల్లును పట్టేసుకున్నది- "ఎంత సాహసం! ఎంత పొగరు! నేరుగా నా దగ్గరికే వస్తావా? నా పంజానే కొరుకుతావా?" కోపంగా అరిచింది.

"నా స్నేహితుడిని బ్రతికించుకోవాలి. అందుకు నీ గోరు కావాలట. అందుకే వచ్చాను నేను. నీ చేతికి దొరికాను కాబట్టి

నువ్విప్పుడు నన్ను చంపు- పరవాలేదు- కానీ, నీ గోరును మటుకు నేను చెప్పిన చోట ఉంచు. మా మిత్రుడి ప్రాణాలు కాపాడు" అంటూ ప్రాధేయపడింది టిల్లు.

పిల్లికి ఆశ్చర్యం వేసింది. "ఏంటి కథ?" అని అడిగి తెలుసుకున్నది. అంతా విన్నాక ఆ ఎలుక మంచితనం ఏమిటో అర్థమైంది దానికి. తన గోరుని తనే కొంచెం కొరికి ఇచ్చింది- "ఇది తీసుకొని వెళ్ళిపో! మళ్లీ నా కంట పడకు!" అని హెచ్చరించి వదిలేసింది టిల్లును.

అతి సాహసం చేసి ప్రాణం పోగొట్టుకొని ఉంటుందనుకున్న తోటి ఎలుకలన్నీ పిల్లి గోరుతో తిరిగి వచ్చిన టిల్లును చూసి నోళ్ళు వెళ్ళబెట్టాయి. స్నేహం కోసం ప్రాణాల్ని పణంగా పెట్టే టిల్లును అంతకాలం ఏడ్పించినందుకు సిగ్గుపడ్డాయి.

నవ్వు

**పొడిగింపు!**

టీచర్: ఏ వస్తువైనా సరే, వేడి తగిలితే వ్యాకోచిస్తుంది. అర్థమైందా?

టింకూ: అందుకనేనా టీచర్, ఎండాకాలంలో సెలవలు పొడిగిస్తుంటారు?

**ఫోను భాష!**

లెక్కల మాస్టారుగా పని చేస్తున్నాడు వెంగళప్ప. పిల్లలతో చెబుతున్నాడు:

వెంగళప్ప: నేను లెక్కల సారుగా దేన్నైనా భరిస్తాను గానీ రాంగ్ నెంబరును మాత్రం భరించలేను.

**శిక్షణలో ఉన్నాడు!**

చిట్టి వెంగళప్ప మెడకు యల్ బోర్డు ఎందుకు తగిలించుకున్నాడు?

అక్షరాలు నేర్చుకుంటున్నాడు కాబట్టి!





# మహిమగల వజ్రం

పులి చెప్పిన కథలు

*మనకే ఓ పులి ఎదురై, ఇలా ఓ కథ చెప్పి ప్రశ్నలు అడిగితే జవాబు చెప్పకుండా ఉంటామా ?*



లీల బలే తెలివైన అమ్మాయి. చాలా ధైర్యం కలది కూడా. వాళ్ల ఇల్లు అడవికి ఒక ప్రక్కన ఉంది. వాళ్ల బడేమో, అడవికి అటు ప్రక్కన ఉంది. అడవిలో చాలా జంతువులున్నై; ఒక పులి కూడా ఉంది!

ఒకసారి లీల బడి నుండి ఇంటికి వస్తుంటే అకస్మాత్తుగా ఆ పులి ఆమెను అడ్డగించింది- "ఊరికే పుస్తకాలు మోసుకొని వెళ్లటం కాదు! నిజంగా తెలివి ఉందో, లేదో నిరూపించుకో, నేను నీకో కథ చెబుతాను; కథ చివర్లో ఒక ప్రశ్న అడుగుతాను. దానికి సరైన జవాబు చెబితే ఇంటికి వెళ్తావు - లేదంటే నా నోట్లోకి! చెప్పు, సరేనా?" అంది పులి కోరలు చాచి.

లీలకు అస్సలు భయం వెయ్యలేదు. కథ అనే సరికి ఇంకా చాలా ఉత్సాహం వచ్చింది కూడా. "ఓ! అంత మాత్రానికి భయ పడతానా, చెప్పు కథ!" అని తొందరపెట్టింది పులిని. అప్పుడు పులి ఇట్లా చెప్పసాగింది-

కొత్తపల్లిలో నివసించే కోటయ్య చాలా పేదవాడు. అయితేనేమి, చాలా మంచివాడు. రోజూ ఏ కూలి పని దొరికితే ఆ కూలి పనికి వెళ్లేవాడతను, అతనికి ఉన్న ఒకే ఒక ఆస్తి ఒక గొర్రె. తను ఎక్కడి కెళ్తే అక్కడికి దాన్ని కూడా తీసుకెళ్లే వాడతను.



ఒకసారి అతనికి ఏదో పొలానికి గట్లువేసే పని ఒకటి దొరికింది. తన గొర్రెను దాపులనే ఉన్న కొండ మీదికి వదిలి, అతను తన పనిని పూర్తి చేసాడు. సాయంత్రం అవుతుండగా గొర్రె కోసం కొండ ఎక్కిన కోటయ్యకు, ఆ గడ్డి తుప్పల్లోనే పడి మెరుస్తున్న రాయి ఒకటి కనబడింది. అతను దాన్ని చేతిలోకి తీసుకొని "భలే మెరుస్తోంది, యీ రాయి?! దీన్ని నా గొర్రె మెడలో కట్టనా, అందంగా ఉంటుంది?!" అనుకున్నాడు.

"ఓ, తప్పకుండా కట్టు! నీకు మేలు జరుగుతుందిలే" అని ఎక్కడి నుండో వినబడింది.

కోటయ్య రాయిని గబుక్కున నేల మీద పడేసి అటూ ఇటూ చూశాడు. ఎవ్వరూ లేరు.

"నేనేలే, మాట్లాడుతోంది! నీకేమీ కాదు. నన్ను తీసుకెళ్లి నీ గొర్రె మెడలో కట్టు!" అన్నది మెరిసే రాయి.

కోటయ్య దాన్ని గొర్రె మెడలో కట్టాడు. ఆ తర్వాత అతను కొంతకాలం పాటు తను ధనికుడై పోయినట్లు కలలు కన్నాడు. కానీ అట్లా ఏమీ కాలేదు. కోటయ్య కోటయ్య లాగే ఉన్నాడు; గొర్రె గొర్రె లాగానే ఉన్నది. ఆ తర్వాత అతను దాన్ని గురించి పూర్తిగా మరచే పోయాడు.

కొన్నాళ్లకి, వ్యాపారి ఒకడు అటుగా పోతూ కోటయ్యని, అతని గొర్రెని చూశాడు. గొర్రె

మెడలో ఉన్నది 'వెల కట్టలేని వజ్రం' అని తెలుస్తూనే ఉన్నదతనికి- కానీ యీ కోటయ్యకే ఆ సంగతి తెలిసినట్లు లేదు.

అతను బండిని ఆపి, కోటయ్యతో "ఏమయ్యా, గొర్రెని ఎంతకి అమ్ముతావు?" అని అడిగాడు.



"ఐదు వేల రూపాయలండయ్యా!" అన్నాడు కోటయ్య. గొర్రె ధర అంతే ఉంటుంది. మరి! వ్యాపారి అతనితో బేరమాడి గొర్రెను నాలుగువేల ఎనిమిది వందల రూపాయలకు కొనేశాడు.

తీరా అతను దాన్ని తీసుకెళ్లి గొర్రె మెడలోంచి వజ్రాన్ని తీశాడో, లేదో - ఆ వజ్రం తపాలున నల్లగా మాడిపోయింది! ఇప్పుడిక దాన్ని సానబెట్టి కూడా ఏమీ ప్రయోజనం ఉండదు!

కొంతసేపు ఆలోచించిన వ్యాపారి వెంటనే వెనక్కి వెళ్లి, కోటయ్యను వెతికి పట్టుకొని, 'నీ గొర్రె మెడలో ఉన్నది అద్భుతమైన వజ్రం' అని చెప్పి, అతను వద్దన్నా వినకుండా పదిలక్షల రూపాయలు అతని చేతిలో పెట్టి వచ్చాడు. చిత్రం-అతను వెనక్కి వచ్చి చూస్తే వజ్రం ధగధగా మెరుస్తోంది!"

పులి యీ కథ చెప్పి, లీలని అడిగింది - "లీలా! ఇప్పుడు చెప్పు! వజ్రం ఎందుకు నల్లగా మాడిపోయింది? వ్యాపారి మనసెందుకు మారింది? వజ్రం మళ్ళీ ఎందుకు మెరిసింది?" అని.

" 'ఆ వజ్రం మహిమ గలది' అని తెలుస్తూనే ఉన్నది. దాని విలువ ఎంతో తెలీని కోటయ్య ఇష్టంగా దాన్ని తన గొర్రె మెడలో వేసినంత మాత్రాన అది చాలా సంతోషపడ్డది. అయితే వ్యాపారికి దాని అసలు విలువ ఎంతో తెలుసు, అయినా అతను దానికి ఏ మాత్రం విలువలేనట్లు ప్రవర్తించి, గొర్రెకు

మాత్రం వెల చెల్లించాడు. ఆత్మ గౌరవం ఉన్న వజ్రం యీ అవమానాన్ని భరించలేక, నల్లగా మాడిపోయింది. వ్యాపారి యీ సంగతిని గుర్తించాడు గనకనే తన తప్పును దిద్దుకునేందుకు ప్రయత్నించాడు. వజ్రానికి తగిన గౌరవం లభించింది; దాంతో ఇప్పుడది మళ్లీ మెరిసింది" అన్నది లీల.

"అబ్బో, చాలా సరిగ్గా చెప్పావు! నువ్వు తెలివైన దానివే! యీ సారికి నిన్ను వదిలేస్తున్నాను- అయితే తిరిగి ఎన్నడూ ఇటు రాకు!" అని లీలను విడిచిపెట్టి వెనక్కి తిరిగింది పులి.



నవ్వు

**తల తిరిగింది!**

మోహన్: అయ్యా ఇది ఎన్ని నక్షత్రాల హోటల్?!

మ్యానేజర్: సార్! ఇది మూడు నక్షత్రాల హోటల్ సార్!

మోహన్: మరి మీ బిల్లు చూసాక నాకు ఐదు నక్షత్రాలెందుకు కనబడ్డాయి?

**మా నాయనే!**

కిట్టు: అమ్మా, నాకో గులాబీ మొక్కా, ఒక జామ మొక్కా కావాలే!

అమ్మ: ఎందుకు నాన్నా?

కిట్టు: మరేఁ ! ఎన్ని సార్లు అడిగినా నువ్వు గులాబ్‌జాంలు చేసిపెట్టట్లేదు మరి!

**కాలాన్ని ఆపిన మనిషి!**

ప్రొఫెసర్: మనిషి ఏమైనా చేయగలడు కానీ కాలాన్ని మటుకు ఆపలేడు..

వెంగళప్ప (అరిచాడు): నేను ఆపేశాను!

ప్రొఫెసర్: ఎలాగ, ఏం చేశావు?

వెంగళప్ప: ఇదిగో, నా వాచీలోంచి బ్యాటరీ తీసేశాను!





# బాదరాయణ సంబంధం

తాత చెప్పిన కథ

*సేకరణ : పిడూరి కృష్ణమూర్తి*



విజయవాడకి సమీపాన రామాపురం అనే గ్రామం ఉండేది. ఆ ఊళ్ళో సీతయ్య అనే భూస్వామి ఉండేవాడు. అతనికి చాలా రోజులుగా తిరుపతికి వెళ్ళి వేంకటేశ్వరస్వామిని దర్శించుకోవాలని కోరిక. అయితే ఆ రోజుల్లో ఒక్కళ్ళే ప్రయాణం చేయటం చాలా కష్టంతో కూడుకున్న పని. అందువల్ల సీతయ్య తన కుటుంబంతో పాటు ఓ నాలుగు కుటుంబాలని వెంటబెట్టుకుని వెళ్ళాలనుకున్నాడు.

అనుకున్నట్లుగానే ఓ ఐదు కుటుంబాల వాళ్ళు కలిసి ఐదు ఎద్దుల బండ్లలో తిరుపతికి బయలుదేరారు. ప్రయాణం చాలావరకు సాఫీగానే సాగింది- కానీ ప్రయాణం మొత్తానికి సరిపడా తెచ్చుకున్న తిండి పదార్థాలు మధ్యదారిలోనే అయిపోయినై. వేరే పనులేమీ లేక, కేవలం తినడమే పనిగా పెట్టుకోవడం వల్ల- అట్లా జరిగిందన్న మాట. మరి ఇప్పుడేం చెయ్యాలి?!

'సాయంత్రానికి గుడికి చేరతాం కదా, అక్కడేదైనా కొనుక్కుందాం!' అనుకున్నారు అందరూ. అయితే అంతసేపు ఆగితే గద!? మధ్యాహ్నానికే ఆకలితో నకనకలాడిపోయారు అందరూ!

ఆ సమయంలో వాళ్ళు ఒక పల్లెగుండా ప్రయాణిస్తున్నారు- 'సరే ఏదయితే అదవుతుంది' అనుకున్న సీతయ్య, బాగా ధనికుల ఇల్లుగా ఉన్న ఓ ఇంటి ఆవరణలో బండ్లు ఆపించాడు. ఇంటి ముందు పడక్కుర్చీలో తీరుబడిగా కూర్చుని ఉన్న ఇంటి యజమాని వైపు చూసి నవ్వుతూ "ఏం బావగారూ, బాగున్నారా?!" అని పలకరించి, "పదండి పదండి లోపలకి, అక్కయ్య లోపలున్నట్లుంది" అంటూ అందరినీ లోపలికి తీసుకెళ్ళాడు.

గుంపు గుంపంతా కిక్కురుమనకుండా లోపలికి చేరింది.

ఇక ఇంటి లోపల యజమాని భార్య 'వీళ్ళెవరో మా ఆయన వైపు బంధువులనుకున్నది. ఎంత ప్రేమగా పలకరిస్తున్నారో చూడు' అనుకొని, అందరికీ మర్యాదలు చేసింది.

"ఏముంది చెల్లెమ్మా! అందరం కులాసా. మీరంతా బాగున్నారా? ఆ వెంకన్న రమ్మని పిలిచాడు, మేమంతా ఆగలేక బయలుదేరాం. ఇవాళ్ల సాయంత్రమే దర్శనం. దార్లోనే కదా, కొంచెం మిమ్మల్నీ పలకరించినట్లు ఉంటుందని ఇటొచ్చాం!" కలుపుగోలుగా ముచ్చటించాడు సీతయ్య.

"అవునా, అన్నయ్య గారూ! రాక రాక వచ్చారు- భోజనం చేసిగానీ వెళ్లటానికి వీల్లేదు. సాయంత్రానికి చేరుకున్నా రాత్రికి దర్శనం అవుతుంది లెండి- దానిదేముంది?! వెంటనే భోజనాలు సిద్ధం చేస్తాను- వెళ్దురు" అని ఆవిడ భోజనాల తయారీ మొదలు పెట్టుకున్నది. వచ్చిన బంధువులంతా ఆమెకు సాయం చేయటంలో పడ్డారు.

వంటపని హడావుడిలో ఉన్న భార్యతో కలిసి మాట్లాడనీయకుండా ఇంటి యజమాని పక్కపక్కనే తిరుగుతూ కబుర్లు చెప్పాడు సీతయ్య.

అలా అలా సంతోషంగా మధ్యాహ్నం భోజనాలయ్యాయి. బంధువులంతా

తిరుపతికి బయలుదేరారు.

“వెళ్ళొస్తాం బావగారూ! ఇప్పటికే ఆలశ్యమైంది" అని, “ఇదిగో చెల్లెమ్మా, ఈ డబ్బుతో చీర కొనుక్కో, హడావుడిలో ఒట్టి చేతులతో వచ్చాం- ఏమీ అనుకోవాకు!" అంటూ ఆమె వద్దంటున్నా వినకుండా చేతిలో కాస్త డబ్బు పెట్టాడు సీతయ్య. ఆవిడ కూడా మర్యాదగా వంగి నమస్కారం పెట్టుకున్నది సీతయ్యకు.

అందరూ లేచి బండ్లు ఎక్కడానికి బయటకెళ్ళారు.

అంతవరకూ ఉగ్గబట్టుకుని ఉన్న భార్య "వాళ్ళెవరండీ అసలు?! మీకెలా చుట్టాలు?! ఎప్పుడూ రాలేదే?!” అని అడిగింది.

“నాకేం తెలుసూ?! నేనింకా మీ తరపు చుట్టాలనుకున్నా! మరి అంత గౌరవంగా పలకరించావే?! ఆగు- కనుక్కుంటా!" అంటూ బండ్ల దగ్గరకి పరిగెత్తాడు ఇంటి యజమాని. అతని వెనకే భార్య కూడా వచ్చింది.

“బావగారూ....ఇలా అడుగుతున్నానని ఏమీ అనుకోకండి- అడగాలంటే నాకే సిగ్గుగా ఉంది- మీకూ మాకూ అసలు బంధుత్వం ఎలాగ..? అడిగేశాడు సీతయ్యని.



సీతయ్యకేం చెప్పాలో తెలియలేదు. ఇంటి వాళ్ళు తేరుకునేలోగా తాము తిరుపతి వెళ్ళిపోతామనుకున్నాడు- ఇప్పుడు ఇక లాభం లేదు-

చుట్టూ చూశాడు సీతయ్య. ఇంటి ఆవరణలో ఒక రేగుచెట్టు కనిపించింది.

“అదిగో మీ ఇంటి ముందు రేగు చెట్టు ఉంది కదా?” అన్నాడు సీతయ్య.

"అవును, ఉంది..!?" అన్నాడు యజమాని- 'తను అడిగిన ప్రశ్నకీ, రేగుచెట్టుకీ సంబంధం ఏమిటా?!' అనుకుంటూ.

"ఇదిగో-

"*అస్మాకం బదరీవృక్షః*
*యుష్మాకం బదరీఫలమ్,*
*బాదరాయణ సంబంధాత్*
*యూయం యూయం వయం వయమ్*"-

("మా ఇంట్లో బదరీ(రేగు)వృక్షం ఉంది. మీ ఇంట్లో బదరీ(రేగు) పండు ఉంది. కనుక ఈ రేగు చెట్టు-పండు లాగా మనం ఇద్దరం సన్నిహిత సంబంధం కలవాళ్లం!" )

మరి మా బండి చక్రం కూడా రేగు చెట్టు చెక్కతో చేసిందే! అట్లా మన సంబంధం మరింత గట్టి పడుతున్నది! మనది బాదరాయణ సంబంధం! అర్థమైందిగా?!" అని వివరించి, ఇంకా తేరుకోని ఇంటి యజమాని వీపును ఆప్యాయంగా చరిచి, కౌగలించుకొని నిమిరి, ఇంటావిడతో "వెళ్ళొస్తాను చెల్లెమ్మా, మా ఊరు తప్పకుండా రావాలి. వచ్చి ఓ వారం ఉండి వెళ్ళాలి మరి!" అని మళ్ళీ ఓసారి చెప్పి, ఎగిరి బండిలో కూర్చున్నాడు సీతయ్య.

భార్యాభర్తలిద్దరూ నోళ్ళు వెళ్లబెట్టి చూస్తుండగానే బండ్లు సాగిపోయాయి!

**కడుపు మంట!**

విలేఖరి: ఈమధ్య పెట్రోలు కంటే బాగా మండేవి వచ్చేశాయి..

శాస్త్రవేత్త: అవునా? ఏమిటవి?

విలేఖరి: ధరలు!

నవ్వు

**ఆధునిక గాంధీ!**

శిష్యుడు: స్వామీ! భక్త జనానికి మీరిచ్చే సందేశం..?

గురూజీ: FM వినకు, TV చూడకు, సెల్‌ఫోనులో మాట్లాడకు

**భిన్నాల లెక్క!**

డాక్టరు: మీకు బిపి 160/80 ఉంది..

లెక్కల అయ్యవారు: అంటే రెండు ఉన్నట్లా సర్?!

# గొడుగుల వ్యాపారం

*కథనం: సి. ప్రణయజ, వెంకటేశ్వర బాల కుటీర్, గుంటూరు.*



రామాపురం చుట్టుప్రక్కల దట్టమైన అడవులున్నాయి. వర్షాలు బాగా కురుస్తాయి. అందుకని ఆ ప్రాంతంలో గొడుగుల వ్యాపారం జోరుగా సాగుతుంది. ఆ సంగతి తెలిసిన రంగనాధం అనే వ్యాపారి పట్టణం వదిలి రామాపురం చేరాడు.



రంగనాధం తెలివిగలవాడు, చురుకైనవాడు, కష్టజీవి, నిజాయితీపరుడు. రకరకాల కొలతలతో, పలు రంగులతో, వివిధ ఆకారాలతో తయారు చేయించే రంగనాధం గొడుగులకు, ఆ గ్రామంలోనేకాదు- చుట్టుప్రక్కల గ్రామాలలో కూడా, మంచి పేరొచ్చింది. శనివారం సంతలో రంగనాధం గొడుగులు విపరీతంగా అమ్ముడయ్యేవి.



రంగనాధాన్ని చూసి ఆశకొద్దీ అదే వ్యాపారంలోకి దిగాడు సోమశేఖరుడు. తను కూడా గొడుగుల అమ్మకమైతే మొదలు పెట్టాడు గానీ, చౌకరకం గొడుగులు తయారు చేయించేవాడు; తక్కువ ధరకు అమ్మేవాడు. 'ధర తక్కువ కదా' అని ఎవరైనా వాటిని కొన్నారంటే మోసమే- ఆ గొడుగులు నాలుగైదుసార్లు కంటే పని చేసేవి కావు! కొన్ని గొడుగుల గుడ్డ చిరిగిపోయేది; కొన్ని గొడుగులు తెరుచుకొనేవి కాదు!

గొడుగులు కొన్నవాళ్ళు సంతలో అతన్ని నిలదీసేవాళ్ళు. పదిమంది ముందు వాళ్ళు తనని అలా చిన్నబుచ్చటం సోమశేఖరానికి అవమానంగా తోచేది. దాంతో రంగనాధం మీద కోపం పెరిగేది. చివరికి ఎలాగైనా సరే, రంగనాధాన్ని ఊళ్లోంచి తరిమేయాలనుకున్నాడు సోమశేఖరుడు.



ఒక రోజు రంగనాధం పని పడి, పట్టణానికి వెళ్ళాడు. ఆ సంగతి తెలిసిన సోమశేఖరుడు 'ఇదే

అదను' అనుకున్నాడు. రాత్రికి రాత్రి రంగనాధం ఇంట్లో జొరబడ్డాడు. అక్కడ మొత్తం వందగొడుగులున్నాయి. ఆ గొడుగులన్నిటికీ కత్తెరతో పెద్ద పెద్ద రంధ్రాలు చేశాడు సోమశేఖరుడు.



తర్వాతి సంతకు ఎప్పటిలాగానే తన గొడుగులు తీసుకువెళ్ళాడు రంగనాధం. గొడుగులు విప్పి చూసిన జనం ఆశ్చర్యపోయారు- అంతా రంధ్రాలే! రామనాధం తన కళ్ళను తానే నమ్మలేకపోయాడు. అయితే చాటుగా నిలబడి చూస్తున్న సోమశేఖరుడు సంతోషం పట్టలేక ఒక్కసారి నవ్వాడు. అది చూడగానే రామనాధానికి అనుమానం వచ్చింది- ఇది అతని పనే అని. వెంటనే గ్రామ పెద్దకు ఫిర్యాదు చేశాడు.

పంచాయితీలో సోమశేఖరుడిని నిలదీసి అడిగాడు గ్రామ పెద్ద. "నాకేమీ తెలియదు స్వామీ; నా మీద కక్షతో ఈ రంగనాధం అభాండాలు వేస్తున్నాడు స్వామీ" అని మొసలి కన్నీళ్ళు కార్చాడు సోమశేఖరుడు.





"సరే- రంగనాథం! మీ ఇంట్లో ఎన్ని గొడుగులున్నాయి?" అడిగాడు గ్రామపెద్ద.

"అయ్యా! అమ్మకానికి నూటయాభై గొడుగులు తయారు చేయించి పెట్టానండయ్యా!" అన్నాడు రంగనాథం సవినయంగా.

"కాదు కాదు! ఎన్ని అబద్ధాలు ఆడతాడో చూడండి- ఇతను చేయించింది నూరు గొడుగులే!" అని అరిచి, చటుక్కున తలదించుకున్నాడు సోమశేఖరుడు. పంచాయతీ పెద్దలంతా నవ్వారు. "గుమ్మడి కాయ దొంగ అంటే భుజాలు తడుముకున్నాడట- దొరికాడు దొంగ!" అన్నారు.

తప్పు చేసిన సోమశేఖరుడిని మందలిస్తూ, "గొడుగుల మొత్తం వెలను రంగనాథానికి చెల్లించు. బహిరంగంగా క్షమాపణ కోరు!" అని ఆదేశించారు గ్రామ పెద్దలు.





**పంట పండింది!**

విలేఖరి: పంటి డాక్టరుగా మీది 'వారసత్వం' అన్నారు. మరి మీ నాన్నగారు, తాతగారు కూడా పంటి డాక్టర్లేనా?

పంటి డాక్టరు: కాదండి. మా నాన్నగారు పండ్ల వ్యాపారం చేసేవారు. మా తాతగారు పండ్లు పండించేవారు.





# కష్టే ఫలే మధురం

*కష్టపడితే వచ్చేవి తియ్యగా ఉంటాయని తెలుసు; కానీ కష్టపడకుండా వచ్చేవి? అవి ఎలా ఉంటాయో ఈ కథ చదివితే తెలుస్తుందేమో, చదవండి!*

*రచన: శ్రీమతి రాధ మండువ, ఉపాధ్యాయిని, రిషివ్యాలీ స్కూలు, మదనపల్లి, చిత్తూరు జిల్లా.*
*సౌజన్యం: 'జాబిల్లి' పత్రిక*

అనగనగా ఒక అడవిలో ఒక నక్క ఉండేది. దానికి చాలా బద్ధకం. తన ఆహారం కూడా తను సంపాదించుకునేది కాదు. ఆ బద్ధకం వల్లనే జిత్తులమారి తనం, దొంగతనం చేయడం, తనది కాని దాని కోసం ఆశ పడటం లాంటి చెడ్డ గుణాలన్నీ వచ్చాయి దానికి.

చెట్టుమీద కూర్చొని కాకి రొట్టె తింటుంటే, ఇది వెళ్ళి కాకిని పాట పాడమని అడిగేది. అమాయకపు కాకి పాట పాడగానే రొట్టె దాని నోట్లో నుండి జారి పడేది; ఇది వెటకారంగా నవ్వుతూ పోయి ఆ రొట్టెను తినేసేది.

అట్లానే ఇది పక్షుల గూళ్ళల్లోని గుడ్లను దొంగతనంగా కాజేసేది; పులికీ, సింహానికీ చెడ్డ మాటలు చెప్తూ అవి తిని వదిలేసిన మాంసం తినేది; ఇట్లా అది మోసంతో రోజులు గడుపుతుండేది.

ఒక రోజు దానికి ఎక్కడా ఆహారం దొరకలేదు. ఎన్ని జిత్తులు వేసినా లాభం లేకపోయింది. దొంగతనం చేయడం కుదరలేదు; క్రూర జంతువుల దగ్గర

మాంసం దొరకలేదు. దాంతో పాపం, ఆరోజు మధ్యాహ్నం అయ్యేటప్పటికి ఆకలితో కడుపు నకనకలాడ సాగింది దానికి. 'ఏం చేద్దామా' అని ఆలోచిస్తూ అది అడవి అంతా తిరుగుతుండగా దగ్గర్లోనే ఓ పెద్ద చెట్టుకు అల్లుకొని ఉన్న ద్రాక్ష తీగ ఒకటి కనిపించింది దానికి.

ఆ చెట్టు కొమ్మలు కొంచెం క్రిందికి వంగి ఉన్నాయి. కొమ్మల చివరన ద్రాక్షపళ్ల గుత్తులు వ్రేలాడుతున్నాయి. ఆకలితో ఉన్న నక్కకు ద్రాక్షపళ్లను చూడగానే నోరూరింది. అది ఎగిరి పళ్ళను అందుకునేందుకు ప్రయత్నించింది; కానీ అవి చాలా ఎత్తులో ఉన్నాయి- దానికి అందలేదు.

తనకు దొరికినదాన్ని దేన్నీ సామాన్యంగా పోనివ్వదు నక్క. అందులోనూ ఇప్పుడు ఆకలిగా కూడా ఉందాయె. అందుకని అది కొంచెంసేపు ఆలోచించి, అటూ ఇటూ చూసింది. ఆ చెట్టుకి అవతలే, కొంచెం దూరంలో ఓ పెద్ద రాళ్ళ గుట్ట కనిపించింది. వెంటనే దానికో ఉపాయం తోచింది.

చాలా శ్రమించి, ఒక్కో రాయినీ తీసుకొచ్చి కొమ్మ క్రింద ఆ రాళ్ళను గుట్టగా పోసింది. అంత పెద్ద రాళ్ళగుట్ట మొత్తాన్నీ మోసుకొచ్చి పోసే సరికి అది బాగా అలిసిపోయింది. దాంతో దానికి మరింత ఆకలి కూడా వేసింది.



అప్పుడింక అది జాగ్రత్తగా రాళ్లగుట్టను ఎక్కి, ద్రాక్ష పళ్ళను అందుకున్నది! దానికి ఎంత సంతోషం వేసిందో చెప్పలేము. అట్లా తన చేతికందిన పళ్లన్నిటినీ గబగబా కోసుకొని, క్రిందకు దిగి, చేతులు కడుక్కొని, ఆ పళ్ళని తిని చూసింది కదా, అవి ఎంత బాగున్నాయో! 'అబ్బ! ఎంత తియ్యగా

ఉన్నాయో!' అనిపించింది. అట్లా అది మళ్ళీ మళ్ళీ రాళ్ళగుట్టను ఎక్కింది. మరిన్ని పళ్ళు కోసుకుని తినటం మొదలుపెట్టింది.



అంతలో అక్కడికొక కుందేలు వచ్చింది. "ఏంటి నక్క బావా తింటున్నావు?" అంది, నక్క చేతిలో ఉన్న ద్రాక్ష పళ్ళ వైపు ఆశగా చూస్తూ. 'ద్రాక్షపళ్ళు! ఎంత బాగున్నాయో చూడు! ఆశ్చర్యపోతావు!' అంటూ నక్క కుందేలుకు కొన్ని ద్రాక్ష పళ్ళను పెట్టింది.

వాటిని నోట్లో వేసుకున్న కుందేలు - "అబ్బ, ఛీ! ఎంత పుల్లగా ఉన్నాయో! యాక్..!" అంది వెంటనే వాటిని ఉమ్మేస్తూ.

నక్క ఆశ్చర్యపోయింది. 'నాకు ఇంత తియ్యగా ఉన్న పళ్ళు కుందేలుకి పుల్లగా ఎందుకున్నాయి? ' అని అనుకుంటుండగానే దానికి అర్థం అయింది- 'కష్టపడి పనిచేసి సంపాదించుకున్నది ఏదైనా తియ్యగా, అపురూపంగా ఉంటుంది' అని.

ఇక ఆ రోజు నుండీ అది కష్టపడి పని చేసుకుని, తన ఆహారాన్ని తను సంపాదించుకోవటం మొదలుపెట్టింది. త్వరలోనే దానికున్న చెడ్డ అలవాట్లు మొత్తం మాయమయ్యాయి! 

**భయం!**

టీచర్: సుజాతా! నీకు స్టేజ్ ఫియర్ ఉందామ్మా?!

సుజాత: ఉన్నది టీచర్! ఎప్పుడు బస్సెక్కినా, నేను దిగాల్సిన స్టేజీ ఎక్కడ దాటిపోతానో అని భయపడుతూనే ఉంటాను!




# ఆవుల్ని వదిలెయ్యటం

బౌద్ధ కథ

*ఈ కథలో వచ్చే ఆవులు మామూలు ఆవులు కావట- అవి మన కోరికలట! అంటే ఈ కథ ద్వారా బుద్ధుడు 'మన కోరికలే మనకు కష్టాలను తెచ్చి పెడతాయి' అని చెబుతున్నాడన్నమాట !*
*మూలం: గౌ.థిచ్ -ణాట్-హాణ్*



ఒక రోజున బుద్ధుడు ఒక అడవిలో ఉన్నాడు. ఆయన శిష్యులు ఒక ముప్పై-నలభై మంది ఆయన చుట్టూ కూర్చొని ఉన్నారు. బుద్ధుడు వాళ్ళకు జీవితపు ఉద్దేశాల గురించి, జాగరూకంగా ఉండటం గురించి, మనసును పరిశుద్ధం చేసుకోవటం గురించి బోధిస్తున్నాడు. శిష్యులందరూ ఆసక్తిగా వింటున్నారు.

ఆ సమయంలో అటుగా వెళ్తున్న రైతు ఒకడు వీళ్లను చూసి, దగ్గరికి వచ్చాడు. అతను ఏదో బాధలో ఉన్నాడని స్పష్టంగా తెలుస్తూ ఉన్నది.

"నా ఆవులు తప్పిపోయాయి. మీ రేమైనా చూశారా? ఇటువైపుగా ఆవుల మంద ఏదైనా వచ్చిందా, మీరు చూస్తుండగా?"

అడిగాడు రైతు.

శిష్యులందరూ అడ్డంగా తల ఆడించారు.

"లేదు. మీ ఆవుల మంద మాకెవ్వరికీ కనబడలేదు" అన్నాడు బుద్ధుడు.



రైతు అలసిపోయినట్లు అక్కడే ఓ చెట్టుకు చేరగిలబడి "అబ్బ! చాలా కష్టంగా ఉంది స్వామీ! చాలా బాధగా ఉంది. పన్నెండు ఆవులున్నాయి నాకు. ఇప్పుడు వాటికి ఏమైందో మరి, ఒక్కసారిగా అన్నీ కట్టకట్టుకొని పారిపోయాయి! ఇక నాకున్నదే నాలుగెకరాల నువ్వుల చేను అంటే, చీడ పట్టి పంట అంతా నాశనం అయిపోయింది- ఒక్క గింజా చేతికందేట్లు లేదు! జీవితం అంతా బరువైపోయింది. ఆత్మహత్య తప్పిస్తే వేరే మార్గం కనబడట్లేదు-" అన్నాడు.

"మిత్రమా! ఎవ్వరి ఆవులూ ఇటువైపుకు రాగా చూడలేదు మేము. వాటి కోసం వేరే దిక్కున వెతికితే ప్రయోజనం ఉండచ్చేమో; చూడు. ఈ దిక్కుకు ఆవులేవీ రావు" అన్నాడు బుద్ధుడు.

రైతు వాళ్లకు ధన్యవాదాలు చెప్పుకొని వేరే వైపుకు బయలుదేరి పోయాడు.

ఆ తర్వాత బుద్ధుడు తన శిష్యులకు చెప్పాడు: "మిత్రులారా! ఈ ప్రపంచంలో 'అందరికంటే సంతోషంగా ఎవరైనా ఉన్నారు' అంటే అది మీరే. పోగొట్టుకునేందుకు మీకు ఏ ఆవులూ లేవు!

మీకే గనక ఆవులు ఉండి ఉంటే, మీరు కూడా ఈ రైతులాగే, వాటిని నిలుపుకునేందుకు చాలా కష్టపడుతూ ఉండేవాళ్ళు!

అందుకని, 'సంతోషంగా ఉండాలి' అనుకునేవాళ్ళు 'ఆవుల్ని వదిలేసే కళ' ను

అభ్యాసం చేయాలి. మీ మీ ఆవుల్ని ఒక్కటొక్కటిగా వదిలేయాలి.

మొదట్లో మీకు అది అంత సులభం కాకపోవచ్చు. 'నా సంతోషానికి ఈ ఆవులు ఉండటమే కారణం!' అని మీకు అనిపిస్తుంది. ఇన్నాళ్ళూ మీకు అలా అనిపించింది కాబట్టే, ఇంకా ఇంకా ఆవుల్ని సంపాధించుకునేందుకు శ్రమించారు. అయితే ఈ సరికి మీకు అర్థం అయిఉండాలి- మీ సంతోషానికి ఆవులు ఉండటం అనేది కారణం కాదు. నిజానికి ఆవులు మీ సంతోషానికి అవరోధాలు!

అందుకని, ఇప్పుడు మీరంతా ఆవుల్ని వదిలేసేందుకు కృత నిశ్చయులు కావాలి!" అని.

దాంతో శిష్యులకి కోరికలు ఎలా ఉంటాయో కొద్దిగా అర్థం అయ్యింది. 

**శిక్ష!**



బాబు: నాన్నా! నువ్వు ఎన్నేళ్ళు చదువుకున్నావు నాన్నా?

నాన్న: నేను పదిహేడేళ్ళు చదువుకున్నాను బాబూ

బాబు: మరి అమ్మ ఎన్నేళ్ళు చదువుకున్నది నాన్నా

నాన్న: అమ్మ పదిహేనేళ్ళు చదువుకున్నదిరా, ఎందుకివన్నీ ఇప్పుడు?

బాబు: మరి నేను ఇంకా ఎన్నేళ్ళు ఇలా చదువుకోవాలోనని!

**సూక్ష్మ దృష్టి!**

డ్రాయింగ్ టీచర్: ఏమ్మా, బంటీ! చక్కని బొమ్మ ఏదైనా వేసి ఇమ్మంటే ఖాళీ పేపరు ఇచ్చావు?

బంటీ: లేదు సార్, నేను చక్కని బొమ్మ వేసే ఇచ్చాను.

టీచర్ (ఖాళీ కాగితం చూపిస్తూ): ఏది, బొమ్మ?!

బంటీ: నేను వేసింది సూక్ష్మ జీవి సార్, కంటికి అట్లా కనిపించదు!




# విలువైన రాళ్ళు

నేపాలీ జానపద కథ

*కథనం: నారాయణ, కొత్తపల్లి బృందం*



అనగా అనగా నేపాలును ఓ రాజు పరిపాలించేవాడు. అతని దగ్గర చాలా సంపద ఉండేది- అంటే ఎన్నెన్నో వజ్రాలు, వైఢూర్యాలు, కెంపులు, మరకతాలు, మాణిక్యాలు, ముత్యాలు- ఇంకా ఎంతో బంగారం ఉండేదన్నమాట. ఎవ్వరికీ లేనంత గొప్ప భవంతి ఒకటి ఉండేదిఆయనకి. ఆ భవనం కూడా భలే ఉండేది. ఎంతో అద్భుతంగా, పెద్ద పెద్ద శిల్పాలతో, చెప్పలేనంత అందంగా ఉండేది. రాజుగారు బంగారు పళ్ళాలలో భోంచేసేవాడు; వెండి గ్లాసుల్లో నీళ్ళు త్రాగేవాడు- త్రాగేసి, తన సంపద గురించి ఆలోచించుకునేవాడు.

ఒక్కోసారి, ఇంక వేరే పనేమీ లేదంటే, అట్లా నడచుకుంటూ తన ఖజానాకు వెళ్ళేవాడు. ఖజానా అంటే సంపదను దాచుకునే గది- అందులో రాజుగారు తన దగ్గరున్న ప్రత్యేకమైన వజ్రాలను, ముఖ్యమైన

వైఢూర్యాలను దాచుకునేవాడు. అవికూడాఎన్ని ఉండేవి అంటే, వాటి రాసులతో గది అంతా నిండిపోయి ఉండేది! చిన్న పిల్లలు ఇసుకతో ఆడుకున్నట్లు, ధగధగా మెరిసే ఆ వజ్రాలతోటి ఆడుకునేవాళ్ళు రాజుగారు . కెంపుల కుప్పలో పాదాలు దాచుకొని, వాటి మీద పగడాలను అమర్చి, 'ఎంత అందంగా ఉన్నాయి, ఇవి?' అని మురిసిపోయేవారు. కొంతసేపు అట్లా ఆడి అలసిపోయి, మరకతాల కుప్పను నెరిపి, మంచంలాగా చేసుకొని వాటి మీద పడుకొని నిద్రపోయేవారు.

ఖజానాలో అట్లా గడిపినంత సేపూ రాజుగారికి సంతోషం ఇనుమడించేది. 'నేపాలుకెల్లా తనే గొప్ప రాజు'-అనిపించి, మనసంతా ఉల్లాసంతో నిండిపోయేది. తన ఖజానాలో ఎంత సేపు గడిపితే అంతసేపు మొలకనవ్వులు రువ్వుతూ ఉండేది రాజుగారి ముఖం. "బహుశ: ప్రపంచంలోకెల్లా అత్యంత ధనికుడైన రాజును నేనే కావొచ్చు' అనే ఆలోచన వచ్చినప్పుడు ఆయనకు మరింత ఉల్లాసం కలిగేది.

ఒకరోజున ఆయన రాజ్యానికి ఒక రుషి వచ్చాడు. ఆయన మహాత్ముడని, జ్ఞాని అనీ అందరూ చెప్పుకుంటుంటే విన్నారు రాజుగారు. వినేసరికి, 'నేను కూడా ఆయన ఆశీస్సులు అందుకోవాలి' అనిపించింది ఆయనకు.



వెంటనే బయలుదేరి రుషి బస చేసిన తోటలోకి వెళ్ళి, ఆయన దర్శనం చేసుకున్నాడు: 'మా మందిరానికి వచ్చి, కొన్నాళ్ళు ఉండండి, మమ్మల్ని ధన్యుడిని చేయండి' అని ప్రార్థించాడు. రుషి సరేనని, రాజుగారి భవనానికి బయలుదేరి వచ్చాడు.

రుషి గౌరవార్థం రాజుగారు ఆరోజు సాయంత్రం గొప్ప విందునొకదాన్ని ఏర్పాటు చేశారు. రుషి ప్రక్కన కూర్చొని, స్వయంగా వడ్డించారు. ఆయనకు తన సౌధాన్నంతా తిప్పి చూపించారు. తనూ, తన రాణులూ ఉండేచోట ఆయనకు బస ఏర్పాటు చేశారు.

అంతా అయ్యాక, ఏనాడూ ఎవ్వరికీ దక్కనంత గౌరవం రుషికి ఇవ్వాలనుకున్నారు- 'నా ఖజానాను చూపిస్తాను మీకు- రండి. మీరు అట్లాంటి సుందర దృశ్యాన్ని ఏనాడూ చూసి ఉండరు. ఈ దేశంలో ఎవ్వరి దగ్గరా లేనన్ని విలువైన మణులు, మాణిక్యాలు నా దగ్గర ఉన్నాయి- ఎన్నంటే, వాటి కుప్పలు ఖజానా పై కప్పుని అంటుకుంటుంటై. రండి, చూద్దురు!' అని వెంట తీసుకు వెళ్ళారు.

రాజుగారు రుషికి ఒక్కడికే అమూల్యమైన ఈ అవకాశం ఇచ్చింది- ఇంతవరకూ రాజుగారు తప్ప, మనిషన్నవాడెవ్వడూ అసలు ఖజానాలోకి అడుగే పెట్టి ఉండలేదు. రాజుగారు చాలా ఉత్సాహంగా ఉన్నారు- "నా ఖజానాని చూసి రుషి ఆశ్చర్యపోతాడు- అద్దిరిపోతాడు అసలు. బహుశ: ఆ సంతోషంలో ఆయన నాకు ఏవో చక్కని వరాలు, ఆశీర్వాదాలు కూడా ఇవ్వొచ్చు.. లేదా, దేశాన్ని చక్కగా పాలించటంలో మెళకువలు ఏమైనా ఒకటి రెండు చెప్పి వెళ్ళచ్చు.." అనుకుంటూ

తన ఖజానా తలుపులు తెరచారు. రెండు చేతులూ బార చాపి రుషిని లోనికి స్వాగతించారు- "రండి, మహర్షీ! చూడండి! కళ్ళు మిరుమిట్లు గొలిపే ఈ సంపదను చూడండి. కప్పునంటే ఈ పగడాల కొండలు చూశారా, ఎంత ముద్దుగా ఉన్నాయో- ఇవి ప్రత్యేకంగా విదేశాలనుండి తెప్పించిన రత్నాలు..." అంటూ కొద్దిసేపు మైమరచిపోయారు.

రుషి చకచకా ఖజానా అంతా కలయ తిరిగి చూశాడు. పెదవి విరుస్తూ- "ఇంతేనా, నీ సంపద?!" అన్నాడు.

రాజుగారు నివ్వెరపోయారు. "అదేంటి, ఇంతింత విలువైన రాళ్ళు మీ కళ్లముందు ఉంటే మీకు సంతోషమూ -ఆశ్చర్యమూ వేయట్లేదా స్వామీ, అట్లా అంటున్నారు?!"

అన్నారు.

రుషి నవ్వాడు-"క్షమించాలి, రాజా! కానీ నాకు నీ ఈ రాళ్లకంటే విలువైన రాళ్ళు తెలుసు. వాటి విలువతో పోలిస్తే ఇవి అసలు రాళ్ళు కూడా కావు!" అన్నాడు.

ఇప్పుడు ఆశ్చర్యపోవటం రాజుగారి వంతు అయింది. ఆయనకు కొంచెం కోపం కూడావచ్చింది. "తన దగ్గరున్న వాటికంటే విలువైన రాళ్ళు వేరే ఎవరి దగ్గర ఉండి ఉంటాయి" అన్నది ఆయన ఊహకే అందని విషయం!

"ఓహో! అట్లానా?! తమరు అనే ఆ విలువైన రాళ్ళేవో ఎక్కడ ఉన్నాయి?" వెటకారంగా అడిగాడాయన, రుషిని. తనకంటే ధనికులు అసలు ఎవరైనా ఉన్నారనే ఊహకే ఆయన నోరు చేదెక్కింది.

"రేపు ఉదయాన్నే చూపిస్తాను మీకు. ఇప్పుడిక నిద్రపోవలసిన సమయం అయ్యింది కదా?!" ఖజానాలోంచి నేరుగా పడకవైపుకు దారి తీశాడు రుషి.

ఆరోజు రాత్రి పరుపు మీద అటూ ఇటూ ఎంత దొర్లినా రాజుగారికి ఇక నిద్ర పట్టలేదు. 'అసలు నాకంటే ఎక్కువ విలువైన రాళ్ళను ఎవరైనా, ఎట్లా సంపాదించి ఉంటారు?' అని ఒకటే మథన పడ్డాడు. 'రుషి నిజమే చెప్తున్నాడంటావా? రేపు నిజంగానే చూపిస్తాడంటావా, ఆ రాళ్ళను?' అన్న ఆలోచనతో రాత్రంతా కునుకు లేదు. ఎంతకీ తెల్లవారలేదు కూడా! చివరికి, తెల్లవారు జాముననే రుషి దగ్గరకు వెళ్ళి "పదండి మరి! త్వరగా తయారవండి! మనం వెంటనే వెళ్ళి చూద్దాం ఆ రాళ్ళను!" అన్నాడు.

రుషి నవ్వాడు. అంతకంటే విలువైన రాళ్ళ గురించి విన్న తర్వాత రాజుగారిలో ఎంత మార్పు! ఎంత ఆత్రపడుతున్నాడు, వాటిని చూడాలని!

రాజుగారిని ఆయన భవంతిలోంచి బయటికి నడిపించాడు రుషి. ఇద్దరూ సన్నని ఓ బాట గుండానడచుకొని దగ్గర్లో ఉన్న గ్రామాన్నొకదాన్ని చేరుకున్నారు. రాజుగారి ఆత్రం మరింత ఎక్కువైంది- 'ఈ పల్లెటూర్లోనా? నా దగ్గరున్న మణులకంటే విలువైన రాళ్ళున్నాయా?' అనుమానిస్తూనే

నడుస్తున్నారు. అక్కడ ఓ ఇంటి వాకిట్లో ఒకావిడ కూర్చొని ఉన్నది- తిరగలిలో ధాన్యం విసురుతున్నది. ఆవిడ ప్రక్కగా నిలబడ్డాడు రుషి- 'అదిగో- చూడండి. ఆ రాళ్లతో ఆవిడ ధాన్యం విసురుతోంది, చూశారా?' గుసగుసగా అన్నాడు విసురు రాయి వైపు చూపిస్తూ.



రాజుగారు తిరగలిని, రుషిని మార్చి మార్చి చూసి, విరగబడి నవ్వారు. "ఏం ప్రత్యేకత కనబడింది స్వామీ, మీకు, ఆ రాతిలో?! ఇట్లాంటి రాళ్ళు వందలు-వేలు ఉంటాయి. ఇది చాలా మామూలు తిరగలి రాయి. దీనికి అసలు ఏమీ విలువే లేదు!" అన్నారు ఎగతాళి ధ్వనించే గొంతుతో. రుషి మూర్ఖత్వాన్ని తలచుకున్న కొద్దీ ఆయనకు నవ్వు ఆగటం లేదు: 'రత్నానికీ, తిరగలికీ తేడా తెలీని వాడు ఏమి రుషి?! ఇట్లాంటివాడికి తన ఖజానా విలువ ఎందుకు తెలుస్తుంది?!'

రాజుగారు వెనుతిరిగి పోబోతుంటే రుషి ఆయన్ని వెనక్కి పిలిచాడు. "ఇటు రా, రాజా! ఇక్కడికొచ్చి ఈ రాయి ఏం చేస్తోందో జాగ్రత్తగా చూడు. ఒక రకంగా చూస్తే నువ్వన్నది నిజమే- దీనిలాంటి తిరగలి రాళ్ళు వందలు- వేలు ఉంటాయి. కానీ మరో విధంగా చూడు- నీ ఖజానాలో బందీలయి కూర్చున్న రాళ్లకంటే వాటి విలువే ఎక్కువ! ఈ తిరగలి రాయి ప్రతిరోజూ ఈమె తినేందుకు అవసరమయ్యేంత పిండిని ఇస్తున్నది- ఏరోజుకారోజు ఈమె కడుపు నిండేందుకు ఇది ఆధారం అవుతున్నది. మరి నీ రాళ్ళవల్ల ఏం ఉపయోగం కలుగుతున్నది?

రాజుగారిలో ఆలోచన మొదలైంది.. 'నిజమే- తన రాళ్లతో నిజానికి ఎవ్వరూ ఏమీ

చెయ్యలేరు! అవి ఎందుకూ పనికి రావు. ఎవరైనా కేవలం వాటిని చూడచ్చు; తాము ఎంత ధనవంతులో తలచుకొని గర్వపడచ్చు- అంతే'-

ఆయన ఆలోచనలు అర్థమయినట్లు, రుషి అన్నాడు- "ఇప్పుడు అర్థమయినట్లుంది, నీకు. నీ దగ్గరున్న రాళ్ళు ఎందుకూ పనికి రావు. ఇక్కడున్న రాళ్ళన్నిటిలోనూ ఈ తిరగలి రాయిని మించిన విలువైన రాయి అసలు లేనే లేదు. ఇది లేకపోతే ఈమె తన ధాన్యాన్ని విసురుకోనేలేదు; రోజూ రొట్టె తయారు చేసుకొని తిననూ లేదు. నీ ఖజానాలో ఉన్న రాళ్లన్నీ కలిసి కూడా చెయ్యని పనిని ఈ తిరగలి రాయి అవలీలగా చేస్తోంది- దీనికేం విలువ కడతావు?"

రాజుగారికి జ్ఞానోదయం అయింది. 'వస్తువుల అసలు విలువ వాటి ఉపయోగం వల్లనే' అని చెబుతున్న రుషికి తల ఒగ్గి నమస్కరించాడు.



నవ్వు!

**పందిరి వాసం!**

వాస్తు సిద్ధాంతి : అమ్మా, మీ పరిస్థితి ఇలా అవ్వటానికి కారణం ఏంటి?

సుభద్రమ్మ: మీరు చెప్పినట్లు చెయ్యటమే!

వాస్తు సిద్ధాంతి: ఏం చెయ్యమన్నానమ్మా, నేను?

సుభద్రమ్మ: సుఖంగా కూర్చొని ఉంటే వచ్చి, ఇల్లు పీకి పందిరెయ్యమన్నారుగా, నేను అదే చేశాను మరి!

**చిన్న నెల**

టీచర్: అన్నింటిలోకి చిన్న నెల ఏది?

చింటు: 'మే' సార్!

టీచర్: అదెలాగా?

చింటు: 'మే' నెలలో ఒకే అక్షరం ఉంది సార్!

# బొమ్మకు కథ రాయండి!

*నిర్వహణ: కొత్తపల్లి*



పూలలోంచి తేనెను తాగుతున్న ఈ పిట్టను చూశారా? దీని పేరు 'హనీబర్డ్' -తేనె పిట్ట అన్నమాట. పిచ్చుక కంటే చిట్టిగా నాలుగంగుళాల పరిమాణంలో ఉండే ఈ పిట్టకు పూలలోంచి తేనెను పీల్చుకునేందుకు అనువైన, సన్నని-పొడవాటి ముక్కు ఉంటుంది. ఇవి మన దేశంతో సహా పూలున్న అనేక దేశాల్లో సంతోషంగా ఎగురుతూ కనిపిస్తాయి.

మరి ఇక్కడ, ఈ తేనెపిట్టకు ఏమైంది? బాగా ఆకలైంది.

అప్పుడు అది ఏం చేసింది? ఇట్లా తేనె త్రాగేందుకని తోటకు వెళ్ళింది.

అక్కడ దానికి..... ఏమి ఎదురైంది, అప్పుడు ఏమైంది- ఈ సంగతులన్నీ ఇప్పుడిక మీరు ఊహించండి. ఆ సంగతులేవో మాకు రాసి పంపితే, బాగున్న కథల్ని ఫిబ్రవరి మాసపు కొత్తపల్లిలో ప్రచురిస్తాం. మొదలుపెట్టండి మరి!

మా చిరునామా: కొత్తపల్లి ప్రచురణలు, 1-127/A, చెన్నే కొత్తపల్లి, అనంతపురం జిల్లా-515101

# పదాల్ని వెతికి పట్టుకోండి!

**దీపకాంతి, కంసాలి, సందడి, షావుకారు, తెలివితేటలు, రాజాగారు, సవారీ, శనివారం, పిల్లవాడు, మర్యాద, చిన్నది, బలము, మురిసిపోయాడు, కొలను, సింహరాజు, పరారీ, పూతరేకులు, జీడిపప్పు, పేదవాడు, పన్నాగం** - ఈ పదాలన్నీ క్రింది పట్టికలో దాగున్నాయి- నిలువుగా, అడ్డంగా, వాలుగా, క్రిందినుండి పైకి- ఎటుపడితే అటు! వాటిని వెతికి పట్టుకోండి! వాటి చుట్టూ గుండ్రాలు గీయండి చూద్దాం!

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| పూ | డు | రం | ల్ల | లు | ట | తే | లి | రం | ల్ల | సిం | జు |
| ర్యా | త | వా | డు | గం | ము | రం | సా | శ | ప | రా | సం |
| సిం | రీ | రే | ల్ల | తే | ప్పు | లి | కం | ప్పు | ద | ర్యా | మ |
| త | పూ | త | కు | పి | సిం | హ | రా | జు | న్నా | వా | కు |
| పే | జు | ము | సం | లు | లు | వా | స | వా | రీ | దీ | రం |
| సిం | ద | ద | కు | ప్పు | ట | ప | న్నా | ది | ప | డు | ము |
| జీ | డి | వా | యా | ప | తే | కం | న్న | కాం | రా | తే | రి |
| షా | బ | గం | డు | డి | వి | చి | తి | గం | రీ | కం | సి |
| వు | ల | తే | రు | జీ | లి | రం | న్నా | రు | సిం | సా | పో |
| దీ | ము | గా | వా | రీ | తె | ప | వా | హ | కా | న్నా | యా |
| ప | జు | ని | ర్యా | కొ | ల | ను | రా | ని | కాం | వు | డు |
| రా | శ | మ | ప్పు | పే | ద | షా | న్న | జు | శ | తి | షా |

# పదరంగం-73

*నిర్వహణ: డా. సిరి, మిర్యాల గూడా, నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం*

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | | 2 | 3 | | 4 |
| | 5 | | | | |
| 6 | | | | 7 | |
| | | | 8 | | |
| 9 | | | | | |
| 10 | | | 11 | | |

## అడ్డం

1. అచ్చుల్లో చివరిది (1)
2. తిరగబడిన 'కాసు' (2)
5. సముద్రంలో ఉండేవి (3)
6. గాడిదకి ఇంకో పేరు-మధ్యలో ఒత్తుంది (3)
7. 'గౌరవం'లో చివర అక్షరం మాయమైంది (2)
8. చిన్న నిద్రను ఇలా అంటారు (3)
9. పామరుడు, వరుసను కోల్పోయాడు (4)
10. రాళ్ళకి ఏకవచనం (2)
11. శీతాకాలంలో వేసేది (2)

## నిలువు

2. 'సులువు'ని ఇలా కూడా అంటారు (3)
3. నడవడానికి ఉపయోగపడే శరీర భాగం (2)
4. గ్రహాలలో ఒకటి (5)
5. యాభై పైసలు, వాడుక భాషలో (5)
7. పాపాయిలు ధరించే డ్రెస్సు (2)
8. పొట్టిగా అయిన బట్టలు ఇలా అయ్యాయంటాం (3)
9. వాల్మీకికి మునులు ఉపదేశించిన మంత్రం (2)

అడ్డం-నిలువు ఆధారాల సహాయంతో ఈ గడులను నింపగలరేమో చూడండి. నింపిన పదరంగాన్ని, కేవలం పోస్టుకార్డుపై రాసి, మాకు అందేట్లు పంపండి. మీ బడి పేరు, తరగతి, మీవాళ్ల ఫోను నంబరు తప్పక రాయండి. సరైన సమాధానం రాసి ఎంపికైన ముగ్గురు పిల్లలకు కొత్తపల్లి-75 ని బహుమతిగా పంపిస్తాం!

# తెలుసుకుందాం!

*నిర్వహణ: కొత్తపల్లి*

## 1. గురు నానక్



సిక్ఖుల ప్రథమ గురువు, పదిహేనో శతాబ్దపు అద్భుత ప్రవక్త గురునానక్ జయంతిని ప్రపంచ వ్యాప్తంగా ఉన్న సిక్ఖులు కార్తీక పౌర్ణమినాడు భక్తి శ్రద్ధలతో జరుపుకుంటారు.

"ఈ ప్రపంచంలోని ప్రాణులన్నింటిలో ఒకే పరమాత్మగా భగవంతుడు వ్యాపించి ఉన్నాడు. ఆ భగవంతుడే సత్యం. సమానత్వం, సంఘీభావం, మంచితనం, నీతివంతమైన జీవితం అనేవి మానవ జీవితానికి నాలుగు మూలస్తంభాలు" అని బోధించారు గురునానక్.

గురునానక్ అనంతరం సిక్ఖు పరంపరకు తొమ్మిది మంది గురువులు ప్రాతినిధ్యం వహించారు. సిక్ఖుల పవిత్ర గ్రంథం 'గురు గ్రంథ సాహిబ్' లో గురునానక్ జీవితంలోని అనేక విశేషాలు లిఖించబడ్డాయి.

## 2. విశ్వనాథన్ ఆనంద్




1969 లో తమిళనాడు రాష్ట్రంలో పుట్టిన విశ్వనాథన్ ఆనంద్ భారతదేశం వెలువరించిన తొలి ప్రపంచ చదరంగ ఛాంపియన్. 2000 సంవత్సరం నుండి 2012 వరకు ఐదుసార్లు ప్రపంచ చదరంగ ఛాంపియన్‌గా నిలిచిన ఆనంద్ 2013 లో తొలిసారి, ఈ మధ్యే 2014 లో మలిసారి అమెరికా క్రీడాకారుడు మాగ్నస్ కార్ల్‌సన్

చేతిలో ఓటమి పాలయ్యాడు.

చిన్నతనంనుండే చదరంగంలో అసమాన ప్రతిభ ప్రదర్శించిన విశ్వనాథన్ ఆనంద్ 2010 లో ఒకేసారి 20,486 మందితో చదరంగం ఆడి ప్రపంచ రికార్డు నెలకొల్పాడు. 2007 లో భారత ప్రభుత్వం ఆయనను పద్మవిభూషణ్ పురస్కారాన్నిచ్చి సత్కరించింది.

### 3. అంతర్జాతీయ యోగా దినం

భారతదేశం ప్రపంచానికి అందించిన గొప్ప విద్యల్లో యోగశాస్త్రం ఒకటి. శతాబ్దాల క్రితం పతంజలి మహర్షి వెలువరించిన యోగ సూత్రాల ఆధారంగా శ్వాసను, శరీరాన్ని, మనసును శుభ్రపరచుకుంటూ ఆత్మ సాక్షాత్కారానికి దారి చూపే యోగవిద్యకు ఈమధ్యే అంతర్జాతీయంగా గౌరవం లభించింది. 193 దేశాలతో కూడిన ఐక్య రాజ్య సమితి సర్వ ప్రతినిధి సభ **జూన్ 21 వ తేదీని** 'అంతర్జాతీయ యోగా దినం'గా ప్రకటించింది.



భూమి అక్షం వంగి ఉండటం కారణంగా మనకు అన్ని రోజుల్లోను పగటి కాలం, రాత్రి కాలం ఒకేలాగా ఉండవు. మార్చి 21, సెప్టెంబరు 23 తేదీలలో పగటి కాలం, రాత్రి కాలం ఒకేలాగా ఉంటాయి- ఈ దినాలను 'విషువత్తులు' అని పిలుస్తారు. వీటికి భిన్నంగా, జూన్ 21 వ తేదీన ఉత్తరార్ధగోళంలో అతి ఎక్కువ పగటి సమయం ఉంటుంది. ఈ రోజును అంతర్జాతీయ యోగా దినంగా గుర్తించటం ద్వారా యోగ శాస్త్రంతోబాటు మన ప్రాచీన ఖగోళ విజ్ఞానాన్నీ ప్రపంచం గౌరవించినట్లు అవుతున్నది.

మీకు తెలుసా? మార్కులకు, తెలివి తేటలకు ఏమంత సంబంధం లేదు.
గణిత మేధావి శ్రీనివాస రామానుజన్ ఇంటర్మీడియట్లో తప్పాడు!
ప్రఖ్యాత భౌతిక శాస్త్రవేత్త ఐన్‌స్టీన్‌కి పాలిటెక్నిక్ ఎంట్రన్సు బాగా రాయక సీటు దొరకలేదు!

# పాట నేర్చుకుందాం

*నిర్వహణ: సౌమ్య నిట్టల*

*గానం: సుష్మ నిట్టల.* *వీణ: చిలకపాటి పద్మావతి గారు*

కరుణశ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రి గారు రచించిన ఓ **తెలుగు బాల!**

తెలుగుదనము వంటి తీయందనము లేదు
తెనుగు కవుల వంటి ఘనులు లేరు
తెలుగు తల్లి సాధుజన కల్పవల్లిరా
లలిత సుగుణజాల తెలుగు బాల

శ్రీ మీగడ రామలింగస్వామి గారు రచించిన ఓ **తెలుగు పద్యం:**

ఉగ్గుపాలనుండి ఉయ్యాలలోనుండి
అమ్మ పాట పాడినట్టి భాష
తేనె వంటి మందు వీనులకును విందు
దేశభాషలందు తెలుగు లెస్స

"పాట నేర్చుకుందాం" శీర్షికలో వచ్చిన పాటల్ని మీరు కొత్తపల్లి వెబ్‌సైటులో వినచ్చు, డౌన్లోడు చేసుకోవచ్చు. సందర్శించండి: http://kottapalli.in

స్వాగతం!

కొత్తపల్లిలో  పిల్లల రచనలకు ప్రాధాన్యత ఉంటుంది. ఈ పుస్తకంలో దాదాపు సగం కథలు పిల్లలు రాసినవి; మిగిలినవి పిల్లలకోసం పెద్దలు రాసినవి.  బొమ్మలు  వేసిన వాళ్ళు  మటుకు  యువకులు.

పిల్లలను కలవటం, వాళ్లతో తెలుగులో కథలు  రాయించటం, బొమ్మలు వేయించటం, వాళ్ళు పంపిన కథల్ని, బొమ్మల్ని సరిదిద్ది మిగతా పిల్లలందరికీ నచ్చేట్లు పుస్తకాలుగా తయారు చేయటం, దానికోసం ఓపెన్ సోర్సు  ఉపకరణాలను వాడటం, కథల్ని అందరూ ఉచితంగా చదువుకునేట్లు ఇంటర్నెట్‌లో పెట్టటంతోపాటు, కొన్ని  ప్రతులు అచ్చు వేయటం  మాకు  ఇష్టం. అందరి  మేలూ కోరి  చేసే  ఈ పనిలో  మీరూ పాలుపంచుకోండి. సాయం చేయండి. పిల్లల  కథల ప్రపంచానికి  స్వాగతం !

**వెలల పట్టిక:**

| | వ్యక్తులు | సంస్థలు | బ్యాంకు ట్రాన్సుఫరు కోసం అక్కౌంటు వివరాలు:<br>Kottapalli Prachuranalu,<br>S.B. A/c No: 62320333310<br>SBH- Dharmavaram Branch,<br>ISFC code: SBHY0020902 |
|---|---|---|---|
| **విడి ప్రతి వెల**<br>(పోస్టేజీ అదనం) | **25** రూ. | **25** రూ | |
| **సంవత్సర చందా**<br>(సాధారణ పోస్టు) | **300** రూ. | **350** రూ. | |

సంవత్సర చందాను మనిఆర్డరు/బ్యాంకు ట్రాన్సుఫరు ద్వారా చెల్లించవచ్చు. **దయచేసి మీ  చిరునామాను పోస్టు / యస్సెమ్మెస్ / ఇ-మెయిలు ద్వారా విడిగా తెలియజేయండి.** పుస్తకాలను సాధారణ  పోస్టులో పంపుతాం, రచయితలు, చిత్రకారులు దయచేసి తమ రచనలను పోస్టు / ఇమెయిలు రూపంలో  పంపగలరు.  పిల్లల చేత పాడించిన చక్కని పాటల ఆడియోలనూ మాకు పంపండి.  పిల్లలకు ఉపయోగకరంగా ఉండేవాటిని  తప్పక  ప్రచురిస్తాం!

కొత్తపల్లి ప్రచురణలు
1-127/A, యం ఆర్ వో ఆఫీసు దగ్గర,
చెన్నేకొత్తపల్లి- 515101
అనంతపురం జిల్లా
ఫోను:  7702877670
ఇ-మెయిలు: team@kottapalli.in
వెబ్‌సైటు: http://kottapalli.in

# కొత్తపల్లికో సంవత్సర చందా

మిత్రుడు సుబ్బారావు చాలా మంచివాడు. గొప్ప పుస్తక ప్రియుడు. "కవితలు చాలా బాగుంటాయిరా, కానీ ఎందుకనో యీ కాలం పిల్లలెవ్వరూ కవితల పుస్తకాన్ని అంతగా చదవట్లేదు" అన్నాడోసారి.

"నిజమే ఒకప్పుడు తిలక్ "అమృతం కురిసిన రాత్రి" అంటేనూ శ్రీశ్రీ "మహాప్రస్థానం" అంటేనూ తెలుగు జనాలు తెగమెచ్చుకునేవాళ్లు. యీ మధ్య అంతగా నచ్చిన కవితా సంపుటాలు అరుదు" అన్నాన్నేను.

"కవితల వరకూ ఎందుకు? పద్యాలూ అంతే. ఇదివరకు పిల్లలంతా ఎక్కాల పుస్తకాలు కొన్నట్లు వేమనశతకం, సుమతీ శతకం కొనుక్కునేవాళ్లా? ఇప్పుడు ఎవ్వరూ వాటి ఊసే ఎత్తట్లేదు" అన్నాడు సుబ్బారావు.

"వాటిని నేర్పే శక్తి, ఆ ఇష్టం ఉన్న తెలుగు మాస్టార్లూ ఉండాలి కదా. పాపం పిల్లలదేమున్నది, పెద్దలెట్లా అంటే అట్లా తలలూపుతారు" అన్నాన్నేను.

"మరి కథల పరిస్థితీ అదే కద! ఎంత మంచి కథలైనా, చదివేవాళ్లేరీ? పిల్లల్లో చదివేశక్తి పూర్తిగా తగ్గిపోయింది" అన్నాడు సుబ్బారావు, ముఖం బాధగా పెట్టి.

"అదేం లేదు. మంచి కథలు, పిల్లలకి అర్థమయ్యే పదాలు, వాళ్ళు మెచ్చే అంశాలు ఉండే కథలు, చక్కని కాగితం మీద, రంగురంగుల బొమ్మల్తో వస్తే, పిల్లలు ఇష్టంగానే చదువుతారు. అయితే ఇందులో ఓ కిటుకున్నది-" ఆపాను నేను-

"ఏంటది?" అడిగాడు సుబ్బారావు.

"ఎంతమంచి పుస్తకాలైనా, పిల్లలమీద ఒక్కసారిగా పడెయ్యకూడదు-చిన్న చిన్న డోసుల్లో, కొద్ది కొద్దిగా రుచి చూపిస్తూ పోవాలి. పుస్తకాల్ని నెల నెలా తెప్పించుకుంటే లాభం అదే. నెలంతా తీరిక ఉండి ఇష్టం కుదిరినప్పుడు చదువుతారు కద, పిల్లలు? తర్వాతి పుస్తకం వచ్చేలోగా యీ నెల పుస్తకాన్ని మూడు మూడు సార్లు చదివేస్తారు! ప్రయత్నించి చూడు మీ పిల్లల్తో కూడా!" అన్నాన్నేను.

"అయితే కొత్తపల్లికో సంవత్సర చందా రాసుకో మరి! నెలనెలా వస్తుందిగా?" అన్నాడు సుబ్బారావు, మూడు వందల రూపాయలు జేబులోంచి తీస్తూ.

---

Printed and Published by Narayana Sarma on behalf of Kottapalli Prachuranalu and printed at Mudrica Offset Printers, Vijayawada and published at “Kottapalli”, 1-127/A, Near MRO Office, Chennekothapalli, Ananthapuram District, AP-515101. Editor: Narayana Sarma